# విషయసూచిక.

# నమస్కృతి.

శా. వేదవ్యాస మహామునీశ్వర ముఖుల్ విజ్ఞానసారస్వతుల్ ।
వేదాన్తప్రతిపాదనప్రవణులై విద్యావిహీనప్రజన్ ।
బ్రోవంజేయఁదలంచి యెయ్యది గృపన్ బోధించి సాధించిరో
యాదైవంబు నమస్కరింతు మెదలో నద్వైతబ్రహ్మాఖ్యమున్

# ఉపోద్ఘాతము.

1893 వ, సంవత్సరమున 'చికాగో' నగరమందు జర గిన ప్రపంచపు సంతసందర్భమున, నూతనముగఁ బ్రపంచ మతాలోచనాసభ యొకటి సమావేశమయ్యెను. ఇది ప్రపం చమునఁగల ప్రధానమతములను విమర్శించి పరిష్కరించు టకై యేర్పడినది. పాశ్చాత్యఖండమున నిపుడు బాహుళ్య ముగఁ బ్రచారములోనున్న జాతీయవస్తుప్రదర్శనములు జరుగునపుడు శాస్త్రసాహిత్యసభలుకూడ నేర్పడి యనుకూ లముగ సాగుచుండుట వాడుకపడెను. ఇవ్విధమున నాయా విషయములయందు నేర్పరులై వానియభివృద్ధికొఱకుఁ బాటుపడుమనుజులు ప్రతిసందర్భమునను జరిత్రలు వ్రాయు చువచ్చిరి. వైద్యన్యాయవాస్తుశాస్త్రంబులును మఱియు జ్ఞానైకవిషయములగు నానాసంగతులను దెలిసికొని యొం డొరులు జ్ఞానవినిమయముచేసికొనుటవలన వస్తుతత్వములు దేశమెల్లెడల వ్యాపించుచుండెను. అమెరికనుల సహజౌదా ర్యసంపన్నతచే నీసభలకన్నింటికిఁ గన్నాకననఁదగు నీమహా మతసభ నిర్మింపఁబడెను. దేశదేశములనుండి మతబోధ కులు సమర్థులు వచ్చి వారివారిమతమహిమాతిశయముల నుగ్గడించుయుక్తులను సావధానముగ విమర్శనాబుద్ధితో వినుటకు 'చికాగో' నగర ముత్సహించెను. ఇట్లు సర్వదేశ

ప్రతినిధులును సమానగౌరవమునొంది స్వేచ్ఛగ మాట్లాడఁ గలుగు మతాలోచనసభ నేర్పఱించి ప్రశంసనీయులైరి.

ప్రజలనుండి ప్రతినిధుల సమర్థులనెంచి పంపుమర్యాదలను బొత్తుగ నెఱుంగకయే, మద్రపురవాసులు గొందఱు వివేకానందస్వామిని బ్రేరేపించి, హిందుమతపక్షమున నుపన్యసింపవలయుననికోరి వానిని దమప్రతినిధిగ నమెరికాకుఁ బంపఁదలంచిరి. స్వామితమపక్షమున మాట్లాడుననియేకాని, యట్టిమహాకార్యము నితఁడు నిర్వహింపఁగలఁడా లేఁడాయను సందియమే వారిభక్తిపూరితమనసులకుఁ దట్టదయ్యె. వివేకానందమూర్తియుఁ దనశక్తి దానెఱుఁగకున్నను, వారలకంటె నమాయికుఁడై, భగవత్సంకల్పముకూడ నేకీభవింప వచ్చునని ధైర్యముతోమాత్రమే, యందులకు వల్లెయని సమ్మతించెను. ప్రఖ్యాతిగాని యోగ్యతాపత్రికగాని లేని సామాన్యులకుఁ జొరశక్యముకాని గట్టితలుపులచే మూయఁబడియుండు నీమహాసభా ద్వారమునకుఁ బ్రవేశము సులభముగఁ జూచినహిందుమతముకంటెనమాయికమతముండునా? అయినను వారిభక్తి యటువంటిది; ఈశ్వరుని భజించినవారిని నాయీశ్వరుఁడే యడ్డలేఁడని వారెఱుఁగుదురు. స్వామి 'చికాగో' నగరమును బ్రవేశించినతోడనే స్థితిగతులన్నియుఁ గరతలామలకములయ్యెను. తననుబంపినవారు తగినయధికారులుగాని క్రమముగ వర్తమానింపఁబడినవారుగాని కారని స్పష్టమే; ఇదిగాక ప్రతినిధులు వచ్చుసమయము దప్పినది; సభ్యులను జేర్చుకొనుపట్టిక పూరింపఁబడినది. ఇట్టియసందర్భమున నేదేని దైవఘటనగలిగినఁగాక, సభాప్రవే

శము దుర్ఘటము. ఎంతటివానికైనను నంతదూరమరిగి, యింటి మొగముపెట్టవలసినచో నెంతనిరుత్సాహముగల్గునోగద !

అప్పుడు తలఁపనితలంపుగ స్వామి 'బోస్టను' పట్టణమున 'ప్రొఫెసర్ రైట్' అనువానిని జూచెను. ఆవిద్యాధికుఁడు స్వామిమేధాశక్తి కచ్చెరువొంది సభాంతరకార్యములకు సాయమొనరించి, పిదప "మిమ్ము యోగ్యతాపత్రికనడుగుట, యెవనియాజ్ఞచేఁ బ్రకాశించుచుంటివని సూర్యుని బ్రశ్నించినట్లే" యని స్వామిని మిగులఁ గొనియాడెను.

సభాభవనమందు మఱికొందఱు హైందవు లుండిరి గాని మొత్తము హిందుమతమునంతను బోధింపఁబూని చనుదెంచినవాఁడు స్వామియొక్కఁడే. మిగిలినవారు తమతమయుపమతములను (అనఁగా హిందుమతశాఖలను) గుఱించి మాట్లాడుటకువచ్చిరి. వివేకానందమూర్తి, హిందుదేశమున కంతకును వర్తించుమతమును, దాను దక్షిణేశ్వరమున గురుప్రసాదముచేఁ గనిన మతమును, బిమ్మట స్వయముగ హిమవత్ప్రాంతములందు సంచరించి యనుభవముచే నంతరించుకొన్న వేదమతమును, సభాసదులహృదయకోశములందు నేకధారగఁ గుమ్మరించెను. మతములెల్లయుఁ బరస్పరమైత్రితో నుండఁగోరు నీమహాసభయందు 17 దినములు ఉపన్యాసపత్రములు పఠింపఁబడెను. స్వామివివేకానందుని యుపన్యాసము 19 వ, తేదిని జదువఁబడెను. కాని మొదటి దినమునుండియుఁ బ్రతినిధులకు స్వాగతోపన్యాసములును బ్రతినిధుల ప్రతివచనములును సభ్యులను దన్పుచుండెను. ఒక నాఁటిసాయంకాలము స్వామి కృతజ్ఞతాపూర్వకముగఁ దన

యామోదమును దెలుప లేచి 'అమెరికాసోదరీసోదరులారా' యని కంఠమెత్తి వచింపఁగానే యానిండుసభయంతయుఁ దహతహఁ గలకలారావముగలదై, తూర్పుననుండివచ్చిన యొకసన్యాసి, స్త్రీలనుముందుగను బురుషులనుబిదపను జేర్చి సభ్యులను రమ్యముగ నాహ్వానముసేసి, లోకమునెల్లను దనకుటుంబముగ నెంచుకొనునంతటి సమత్వముగలవాఁడని యాశ్చర్యపడెను. అచ్చటి జనులందఱు 'మనలో నొకండై నను నిట్లు దలపోయఁడుగదా' యని యొండొరులనుకొనిరి. ఆక్షణమునుండియు స్వామియందందఱికిని భక్తివిశ్వాసము లతిశయించెను. తరువాత, సభావిషయమున శ్రమంపడు చున్నవారలు సభకువచ్చియున్న జనులరొదను మాఱువిధమున నణంపఁజాలక, "వివేకానందస్వామి యుపన్యాసమునో, కథనో, చివరమీకుఁజెప్పనైయున్నాఁడ" ని ప్రలోభపెట్టి, బాధకరముగనున్న సభాజనమును శాంతిపఱుచుచుండుట సామాన్యమయ్యెను! ఈకథలు కొన్ని యీచిన్నిపొత్తము నందుఁ బొందుపఱిచితిని.

ఈమహామతసభ హిందుమతచరిత్రమున నొకక్రొత్త శకము నారంభించెనని చెప్పవచ్చును; హిందుమతప్రాముఖ్యము క్రమక్రమముగ నందఱకును జక్కఁగఁ బోధపడఁ గలదు. ఈమతసభ మొదటినుండి సమాప్తివఱకును గనుల మిఱుమిట్లుగొలుపు నలంకారప్రభలతోడను, బరదేశప్రతినిధుల ప్రతిభలతోడను, దేవేంద్రసభను మించియుండెను. కోట్లకొలఁదిజనుల నానావిధమతాభిప్రాయములును నీసభావేదికపై నివేదింపఁబడి యామోదింపఁబడెను. ఈసభను

శ్రీయుత "ఝాన్ హెన్రి బారోస్" దొరగారిటుల వర్ణించిరి.

"నిర్ణీతకాలమునకు ముందుగనే సభామందిరము ప్రతినిధులతోడను జూపఱతోడను గ్రిక్కిఱిసియుండెను. దేశము నలువైపులనుండియు, నితరదేశములనుండియు నాల్గువేల సభ్యులు కుతూహలులై వచ్చి కొలంబియాసభ నలంకరించిరి. ఉదయముపదిగంటలకుఁ బెక్కులు పలుజాతీయపతాకములు పైని నల్లారుముద్దుగ నల్లలాడుచుండ, వేలకువేలు సభ్యు లుల్లాసంబున దరహాసితవదనారవిందులై కొలువుతీర్చి కూర్చుండఁ, బ్రపంచప్రతినిధులు పలువురు చేయిచేయియుఁ బట్టుకొని మందిరాంతరమునకు విచ్చేసిరి. నట్టనడుమను సంయుక్తరాష్ట్రములలోని ప్రధానమతగురువై, సభాధ్యక్షుతాదత్తుండై, సింహాసనాసీనుండునై ఈశ్వరధ్యానంబుతో సభాకార్యముల నారభించెను.

"ఆయన కిరుప్రక్కలను గ్రాగ్రీకు ప్రతినిధులు బ్రాహ్మ బౌద్ధ మహమ్మదీయమతస్థులు దివ్యాంబరధరులై సమాసీనులయిరి. అందగ్రగణ్యుఁడు వివేకానందస్వామి. ఈయన కాషాయవస్త్రములనుధరించి యెట్టని తనముఖంబుపై శిరంబునఁ బచ్చనితలపాఁగఁజుట్టి సభ్యులనాకర్షించుచుండెను. వానిప్రక్కనే బ్రహ్మసామాజికుఁడు నాగర్కారుమహాశయుఁడును దరువాత సింహళద్వీపమునుండి ప్రతినిధిగవచ్చిన బౌద్ధపండితుఁడు ధర్మపాలుండును గూరుచుండిరి. మహమ్మదీయ, పారసీక, జైన, మతగురువులును, 'చీనా' 'జపాను' దేశమహానీయులును, మఱియు ననేకబుద్ధిమంతులు తమ

మతమును బోధింపఁ బ్రాతినిధ్యముఁబూని యేతెంచి యుచితాసనంబుల నలరించిరి."

వివేకానందస్వామి తనయుపన్యాసాంతమున నెదుటఁ జూచుచున్న ప్రపంచమహాసభను బహురమణీయముగ నశోకచక్రవర్తికొలువుకూటముతోడను,' నక్బరుచక్రవర్తి మతసభలతోడను బోల్చి, వానినైతిహాసికోన్నతివిషయమై స్వాభిప్రాయమును నిపుణముగ వ్యక్తీకరించెను. దానిసారమును జదువరులు గ్రహింతురుగావుత.

మిత్రులారా, నాప్రార్థన యొకటిమాత్రముగలదు. ఇందు మతము విషయముగుటచే భాషాంతరీకరణమందు, నాకుసాధ్యమైనంతవఱకు, మాతృకనే యనుసరించినాఁడను. మహాపురుషునియుపన్యాసము, గంభీరమైనవిషయము, నిరుపమానమగు విమర్శనము గావున వీని నాలోచించి గుణగ్రాహకులరగు మీరు నాభాషాలోపములను గరుణింపుఁడు. బాలురకు సయితము తేలికఁగా దెలియునని లఘుటీకను జేర్చి, స్వామి యుదహరించిన గీతోపనిషదాదివిషయములకు మూలములను దాత్పర్యసహితముగ వ్రాసినాఁడను.

# వివేకానందస్వామి జీవితసంగ్రహము.

---

వివేకానందస్వామి 1863 వ, సంవత్సరమున జన్మించెను. వారు వంగదేశపుకాయస్థులు. వీరు సన్యసింపక పూర్వము నరేంద్రనాథదత్తుఁడని పిలువఁబడుచుండిరి. వీరి వంశమున నందఱును న్యాయవాదులు. కొంతకాలము వీరి తండ్రి మధ్యపరగణాలలో గొప్పన్యాయవాదియై తనరెను. తరువాతఁ గాలీఘట్టము (అనఁగాకలకత్తా) నగరమున 'హైకోర్టు'లో 'లాయరు' గనుండెను. మనస్వామికిని వంశానుగతమగు న్యాయవాదిపదమునందే దృష్టిపాఱెను; అంత 1884 వ, సంవత్సరమున బి. ఏ. పరీక్షయందు దాయన యుత్తీర్ణులయిరి.

స్వామిబాల్యము సజ్జనసాంగత్యమందును,సత్ప్రవర్తనమునందును, దైవధ్యానమందును రామాయణపారాయణమునందును నత్యంతాసక్తిని వెల్లడించెను. అన్నిపరీక్షలలోను నుత్తమముగఁ గృతార్థుఁడగుచుఁ దోడిచదువరులకును గురువులకును గౌరవాస్పదుఁడై పొగడొందెను. బాలురుచేయుప్రశ్నములకు 'బైబులు' (క్రీస్తుమతగ్రంథము) పాఠముచెప్పునుపాధ్యాయుఁడు సమాధానముచెప్పనేరక పరిహాసపాత్రుఁడై యుండ గురువులగౌరవమును గాపాడి తానే

లేచి సరియైన ప్రత్యుత్తరములనిచ్చి సంతుష్టిపఱచుచునుండె నని వినుచున్నాము. నరేంద్రునకు (పూర్వాశ్రమవ్యవహారనామము) సంగీతము, సాహిత్యము, చిత్రలేఖనము, నర్తనము మొదలగు విద్యలందుఁ బాండిత్యముగలదు. ఇంతియకాక ముఖమునందు జీవకళ, దృష్టియందుగంభీరత, విశాలఫాల ప్రదేశము లోనగుసహజలక్షణములుగలిగి జనులనెల్లర నతఁడాకర్షించి తనభావిమహిమను సూచింపఁగలిగెను.

పిదప, ముస్ముందుగ 'వకీలు' పనినారంభించినను నందు గడి తేఱఁడు. కాని నరేంద్రుఁడు మతవిషయమునఁ బట్టుదలవహించి స్వమతపరమతములందుఁగల మహాతత్త్వముల నెఱింగి యీశ్వరభక్తుఁడై కాలముగడుపఁదొడఁగెను. దురాచారపిశాచముల మిగులవెగటొంది, యితఁడప్పుడు మెప్పువడయుచున్న బ్రాహ్మమతమునఁజేరి దైవకీర్తనములందును ధ్యానములందునుఁ దన్మయుఁడై కీర్తిగాంచుచుండెను. దేవుని జూడవలయునని యాయనమనసు మిగులబాధించెడిది; దేవునిజూచితిరా? నాకుఁజూపఁగలరా? యని గురువులను బలువురనడిగి తృప్తిగనక తొట్రుపడుచుండ, వీరిమనోరథము నీడేర్చి పరమవేదాన్తోపదేశముల సంతృప్తిపఱచిన మహామహుఁడు జగద్గురువు శ్రీరామకృష్ణపరమహంస. ఈమహనీయుఁడు కాళీనగరమున వెలయు కాళికాలయమున నర్చకుండై శిష్యుల ననేకుల నాటితేర్చి మహాయోగియై వఱలెను. వీరిమతోపదేశములనిగ్గు "స్వమతవిసర్జనమును

బరమతదూషణమును గూడనివి” యని మనము తెలియు దుము. ‘మీరలు నేచెప్పినమహాతత్త్వములను బరుల కంద అకు నుపదేశింపుఁడు’ అని తమశిష్యుల కానతిచ్చి 1886వ, సంవత్సరమునఁ దమసాత్తగు పరమపదవి నలరించిరి.

అప్పటినుండియు ఛాత్రవరులు కొందఱు సన్యసించి నానాదిక్కుల నుపన్యాసములనిచ్చుచువచ్చిరి. వివేకానంద స్వామి పరమగురునిజీవితకాలమందే యత్యాశ్రమమును స్వీకరించెను. ఇంతదనుక గురుపాదములసేవించి, పిమ్మట హిమవత్పర్వతములందుఁ జిరకాలముసంచరించి మహాజ్ఞా నియై వచ్చి కాశీనగరమున నొకమఠమును స్థాపించి సహా ధ్యాయులకుఁ దానుబెద్దయై లోకోపకారమునకు గడంగెను.

1892 వ, సంవత్సరమున స్వామి చెన్నపురి కేతెంచెను. వీరి యద్వితీయపాండితినిజూపుమహోపన్యాసముల కచ్చెరు వొంది పౌరులనేకులు శిష్యులై మూఢత్వమునువీడి నిజమత మున గౌరవముగల వారైరి. ఈసమయమునందే ‘యమెరికా’ ఖండమున ‘చికాగో’ నగరమందు సర్వమతమహాసభ, కానై యుండుటదెలిసి మనహిందుమతము నుపదేశింప వీరేసమర్థు లనియెంచి రాజాధిరాజులు ధనసాహాయ్యమొనరించిస్వామిని మనకుఁ బ్రతినిధిగ నచ్చటకుఁబంపిరి. ఈసభయం దిదివఱలో క్రైస్తవమతమునే యుత్కృష్టమతముగఁ దీర్పుచుండిరి.

మనలో సముద్రయానమునకుఁ జెలరేపినవారు స్వామియేయనవచ్చును. అందుఁ దమకుతూహలమును బ్రక

టించి మనకొకపెద్దపత్రమును వ్రాసిపంపిరి. ప్రకృతోపన్యాసము 1893 వ, సంవత్సరము 'సెప్టెంబరు' 17 వ, తేదిని 'చికాగో' సర్వమతసభయం దీయఁబడెను. దీనిసారస్యము చదువరులు గ్రహింతురుగాత.

ఇట్లు దినమునకు రెండుపన్యాసములుచొప్పున నమెరికాలోని నానా ప్రదేశములందు జ్ఞాన,కర్మ,భక్తి,రాజయోగములనెల్లను విప్పిచెప్పి యచటిమనుజులమనసులఁదార్ద్రాలు చేసి యందందుసమాజములు,పాఠశాలలు, మఠములు,పత్రికల్మున్నగునవేర్పాటుచేసి యసంఖ్యాకులయిన తనశిష్యుల దేశీయులలోఁబ్రధానులనియోగించి, మతప్రచారమున కానతిచ్చి స్వామి 1895 వ, సంవత్సరమున నింగ్లాండున కేగెను.

అచ్చటఁ గొన్నిమాసము లుపన్యసించి, యటనుండి 'స్విట్జర్లండు' 'జర్మనీ',మున్నగు దేశములందుసయితము తమ వేదాన్తజ్ఞానసూర్యుని బ్రకాశింపఁజేసి తుదకు జన్మస్థానమునకు 1897 వ, సంవత్సరమున వచ్చెను. అంత భారతవర్షమునందంతటను దృష్టిదీర నుపన్యాసవర్షములనుగురిపించి సోదరుల సత్క్రియాకాండములను స్వీకరించి మఠములను వేదాంత సభలను, సేవాశ్రమములను, ననాథశరణాలయములను, బత్రికాకేంద్రములను, బాఠశాలలను, సమాజమందిరములను, గోష్ఠీమంటపములను, ధర్మసత్రములను, నిరుపేదల కన్నదానశాలలను లెక్కలేని మహాజనోపయోగములను సమకూర్చి దేశోద్ధారకుండై పఱఁగెను.

స్వామి, రెండవతడవ, మనదేశమునుండి లండను, "అమెరికా" "ఫ్రాన్సు" మున్నగుచోట్లకు జని యనేక ప్రసంగములను జేసి వేదాన్తసంఘములనన్నింటను సంఘటింపఁ జేసి తిరిగి తిర్గి 1900 వ, సంవత్సరము మాతృభూమిని జూచిరి. ఇచ్చటి మహాక్షేత్రములను దర్శించి వేదాన్తోపదేశబీజములను దిక్కు దిక్కున విచ్చలవిడిగ వెదఁజల్లి 1902 వ, సంవత్సరమున 'బేలూరు' ప్రధానమఠమున బ్రహ్మసాయుజ్యమునొందిరి. ఇప్పటికి వారివయస్సు 39 సంవత్సరములుమాత్రమే. తమపూనినకార్యమునెఱవేర్చి దిగన్తవిశ్రాన్తకీర్తిమంతుఁడై తననిజతత్వమెఱింగి స్వామి పార్థివదేహమునుజాలించెను.

శ్రీరామకృష్ణపరమహంస, నరేంద్రునెఱింగి, యితఁడు కర్మయోగియగుయు, నలుఁదవ సంవత్సరమును జూడఁడనియుఁ, దన్నుదా నెఱింగినవెంటనే దేహమునుజాలించుననియుఁ దన యితరశిష్యులకెఱిఁగించి, తనకార్యము నిర్వహించువఱకు నిజతత్వము నెఱుంగకుండఁ జేయుము తల్లీ యని తనకాళిని ప్రార్థించెనని యును దెలిసి యానందింతుము.

మఱియు నాయానందమునుమడించుచున్నది, ఏలయనఁగా:—ఇచ్చట మామద్రనగరమఠమున జ్ఞానకర్మయోగులగు శ్రీరామకృష్ణవివేకానందుల యంశములో యవతారములో యన సందియముంబొనరించు శర్వానందరామస్వామయ్యంగార్లు నాకుఁ బరమపూజ్యులు.

'ఓంతత్సత్.'

# 'చికాగో' నగరోపన్యాసములు.

---

## [1]హిందుమతము.

చరిత్రకారులెఱుంగని పూర్వకాలమునుండియు మన కనుగతములయివచ్చుచు, నిపుడు మూడుమతములుమాత్రము ప్రపంచమున వెలయుచున్నవి. అయ్యవి హిందుమతము, [2]జొరాస్ట్రియను మతము, యూదులమతము. వానికన్నింటికిని మహావిఘాతములు సంభవించినను నశింపక యవి నిలఁబడి తమయంతశ్శక్తిని వెలిఁబుచ్చినవి. అందు, యూథమతము క్రైస్తవమతమును లోఁబఱుపఁగొనఁజాలక, సర్వజయశాలినియగుతనకూఁతుచే జన్మస్థానమునుండి తఱుమఁగొట్టఁబడెను. తమనుహామతమును విశదీకరింపవలయునన్న నిపుడు పారసీకులందఱును గలసి మిగులనల్పసంఖ్యాకులు మాత్రమే మిగిలియున్నారు. ఇట్లుండ, హిందుదేశమున వేదమతమును నడుగంటఁద్రొక్కి యణఁపంజూచి యవాం

వేదమత ప్రాశస్త్యము.

---

లఘుటీక.

1 సింధునదీవాస్తవ్యుల మతము ; 'హిందు' అని పూర్వ.

2 జరదష్టమహర్షి యొక్క మతమని కొందఱు చెప్పుదురు. ఈయన కొన్ని యుపనిషత్తులందుఁ జేర్కొనఁబడెను; ఈమతమే యిప్పటి పారసీక మతమని తెలియుచున్నది.

తరమతములు పెక్కులుద్భవిల్లెను; గాని యుద్ధురభూకంప మున సముద్రతీరనీరములవలె, నియ్యది యొకక్షణము వెనుకకు మఱలినను, దిరిగి వేయిమడుంగు లధికవేగమున సర్వమును మ్రింగఁజాలు మహాప్రవాహముతో సముద్రజలము ముందు నకుఁజనుదెంచునట్లు, జాతిమతకల్లోలము కొంత విరమింపఁ గానే, యీ తెగలనన్నింటిని గుటకరించి, యైక్యపఱచి, [1]తానుమాతృమతమేగావున వీనినెల్లను దనమహాశరీరమున దిట్టముగ సంఘటించుకొనెను.

హిందుమతమున సమస్తము నిమిడియున్నది; [2]విజ్ఞాన శాస్త్రప్రకారము నవీనకాలమునఁ గనిపెట్టఁబడినవిషయము లెల్ల, యేశాస్త్రముయొక్క ప్రతిధ్వనులనఁ బోఁచెడినో యట్టి వేదాన్తశాస్త్రమునందలి [3]యాధ్యాత్మికోన్నత ప్లావముల నుండి, [4]బహుభంగులఁ బౌరాణికైతిహాసికగాథలతో నిండి ముప్పిరిగొనియున్న విగ్రహారాధనమునకుఁ జెందు నధమాభి ప్రాయములవఱకును నుపపాదింపఁబడు [5]నానావిధమేధా విషయములును, బౌద్ధుల [6]యజ్ఞేయవాదములును, జైనుల [7]నాస్తికసిద్ధాంతములును, సర్వమును, హిందుమతమునం దవకాశమునొంది, దృఢముగఁ గూర్పఁబడియున్నవి.

---

1 వేదమతము, లేక హిందుమతము. 2 ఆంగ్లేయమున 'సైన్సు' అని వచింతురు. 3 పరమాత్మవిషయమై ప్రతిపాదింపఁబడిన మహాతత్త్వములు. 4 పలువిధముల. 5 అన్నితరగతుల ఆలోచనాభాగములు. 6 దేవుఁడున్నాఁడో లేఁడో యని సందేహింపఁజేయువాదములు. 7 దేవుఁడు లేఁడని స్పష్టముగ నిరాకరించుమతము.

అట్లయిన, నింతింతదూరసంబంధములుగల యీ [1]చక్రారములన్నియు నేమధ్యప్రదేశమునఁగలియును? పయికి బాహ్యముగ విరుద్ధములుగ నగపడుచున్న యీ వేర్వేఱుమత ములకన్నిటికిని సామాన్యమైయున్న యాధార మెయ్యది? ఈప్రశ్నమునకే నేనిపుడు సమాధానముఁ జెప్పఁ బ్రయ త్నించెదను.

హిందువులు తమమతమును వేదములమూలమున గ్రహించిరి; అవియే, వారికాధారములు. వేదము లాద్యన్త రహితములని వారునమ్ముదురు. మొదలును

**వేదములు నిత్యములు.**

జివరయులేకుండ గ్రంథముండునా యని యీసభ్యులకందఱకును బరిహాసపాత్రము కావచ్చును; కాని వేదములనఁగా నే పుస్తకములని యభి ప్రాయముకాదు. వేర్వేఱుకాలములయందు వేఱువేఱు పురుషులు గ్రహించి వెల్లడించిన పరమాత్మవిషయకములగు ధర్మములరాశియని వాని యభిప్రాయము. ఆకర్షణస్వభావ ముగల యొకగొప్పశక్తి ప్రకృతియందుఁగలదు; ఈశక్తి మనుజులకుఁ దెలియకపూర్వముకూడ నాశక్తి యేలాగునఁ బ్రకృతియందు వెలసియుండెనో, మనుజులందఱును నట్టిశక్తి యున్నదని మఱచినప్పటికిని నయ్యది యథాపూర్వముగ నేలాగునఁ బనిచేయుచుండునో, యావిధముననే యాధ్యాత్మిక ప్రపంచము నేలునట్టి సర్వనియమములును [2]సర్వదా

1 చక్రముయొక్క యాకులు. 2 ఎల్లప్పుడును.

వెలయుచునేయున్నవి. ప్రతిజీవాత్మకును బరస్పరముగల నైతిక, ధార్మికాధ్యాత్మికసంబంధములును, బ్రత్యేకజీవాత్మకును [1]దజ్జనకమైనపరమాత్మకును గలనైతికధార్మికాధ్యాత్మికసంబంధములును, మనకుఁ దెలియునియపుడును గలవు; తెలిసి యొకవేళ మనము వానిని [2]నేమఱుటతటస్థించినను, నవిమాత్ర మెల్లపుడును నష్టేవెలయుచుండును.

ఈనియమములను మొట్టమొదటఁ దెలిసికొనినవారు ఋషులని వ్యవహరింపఁబడుచున్నారు. వారలను మేము సంపూర్ణజ్ఞానులనుగ గౌరవింతుము. ఈఋషి[3]పుంగవులలోఁ గొందఱు సతీమణులును గలరని యీసభవారల కెఱుక పఱుప నాకానందముగలుగుచున్నది.

మఱియు నీనియమములు [4]నియమములులాగున నశింపక శాశ్వతముగ నుండవచ్చునుగాక; కాని వాని కాది యుండితీరవలయుఁగదా యని యిచ్చట శంకింపవచ్చును; సరియే; వేదములు, 'సృష్టి యాద్యంతరహితమ'ని మాకు బోధించును. మాయాస్వరూపయగు నఖిలబ్రహ్మాండశక్తియు మొత్తముమీఁద సదా మాఱక యొకేవిధముగా నుండునని మనకు విజ్ఞానశాస్త్రము నిరూపించుచున్నది. అటులయినచో, నేపదార్థమును లేక యున్నకాలమునందు, [5]వ్యక్తరూపముగల యీశక్తియంతయు నెచ్చట నెలకొని యుండెను? కొందఱు, నిర్గుణపరబ్రహ్మమునందు [6]లీనమై

1 జీవాత్మకుకారణమయిన. 2 మఱచుట. 3 శ్రేష్ఠులు. 4 ఒకరిచే ఏర్పఱుపఁబడినవి. 5 కంటికగపడు. 6 అణఁగినదై.

యీశక్తి [1]యవ్యక్తముగనుండెనని వచింతురు. ఆపక్షమందు భగవంతుఁడు కొన్ని వేళల నుం దవ్యక్తుఁడై మఱికొన్ని వేళలందు వ్యక్తుఁడై కావలసియున్నది; అనఁగా దేవుఁడుకూడ నొకస్థితినుండి [2]వేఱొండుస్థితికి మాఱెడుస్వభావముగలవాఁడని సిద్ధించును; అనఁగా భగవంతున కనిత్యత [3]యాపాదింపఁబడుచుండెను. చంచలమైనప్రతిపదార్థమును వస్తుసమ్మేళనము వలనఁ బుట్టుచున్నది. ఇట్టి [4]జన్యపదార్థముల కన్నింటికిని నాశనరూపమగుమార్పు గలుగకమానదు. కావున భగవంతుఁడు నశింపవలసియుండెను; ఇది కేవల మసంగతము. కాఁబట్టి యెన్నండును సృష్టిలేనికాలమే గాన్పింపదు.

సభ్యులు సెలవిచ్చినయెడల నొకదృష్టాంతము చెప్పెదను. స్రష్టయు సృష్టియు ననునవి రెండు [5]సమదూరరేఖలు; ఆద్యంతములులేక యెచ్చోటఁగొల్చినను నొకదానికొకటి [6]సమానాంతరము గలిగి సాగుచుండెడు రెండు గీతలు. భగవంతుఁడు సర్వశక్తుఁడు, సర్వవ్యాపి, సర్వనియంత. ఈశ్వరసంకల్పముచేతనే యొక్కకల్పముతర్వాత మఱొకకల్పము అవ్యక్తమునుండి [7]యుత్పన్నమై, కొంతకాలము తనరారి, తిరిగి యవ్యక్తమునందే [8]లయమును బొందుచుండును. ఈపాఠమునే హిందుదేశమునఁ బ్రతిబాలుఁడు దనగురుసన్నిధిని

1 కంటికగపడక. 2 మఱొక. 3 వచ్చుచుండెను. 4 జన్మము నొందెడు. 5 ఇంగ్లీషున 'Parallel lines' అనియందురు. 6 ఎడము. 7 పుట్టి. 8 నాశమును.

బ్రతిదినమును బలించుచుండును. "[1]భగవంతుఁడు పూర్వ కల్పమునందువలెనే యీసూర్యుని నీచంద్రుని స్మరించి సృజించెను." ఇప్పు డిదియే, [2]నవీనవిజ్ఞానశాస్త్ర సమ్మతమై యొప్పుచున్నది.

నేనిచట నిలఁబడియున్నాఁడను. నేను నాకండ్లు మూసికొని మనసునందు "నేను, నేను, నే న"ని [3]భావనచేసినయెడల, నాకగపడుభావ మెయ్యది? శరీరభావమే. ఆలాగయినచో, 'నేను' అనునది

ఆత్మనిత్యము.

చైతన్యములేని [4] భౌతికపదార్థములసంయోగమేనా? పేఁ ఱొండుకాదా? వేదములు "అట్లుకాదు" అని చాటుచున్నవి, "[5]చైతన్యశూన్యమైన వస్తు[6]సంగతికాదు." 'నేను' అనునది శరీరమునందునివసించియున్న యొకజీవాత్మ. 'నేను' దేహమనుగాను. ఈశరీరమునశించును. నాకునాశనములేదు. ఇచ్చట నేనీదేహమునం దున్నవాఁడను; ఈదేహము నశించిపోయి నపుడుగూడ నేను సదా జీవించుచునేయుండుదును. నాకుఁ బూర్వజన్మమునుగలదు. జీవాత్మ కేవలము [7]శూన్యములో నుండి సృజియింపఁబడలేదు; ఏలయందురా, సృష్టియనఁగాఁ

1 "సూర్యాచంద్రమసౌధాతా యథాపూర్వ మకల్పయత్" అనిమూలము. 2 "సైన్సు" అని ఇంగ్లీషుపదమునకు సరియగు వ్యవహారనామము. 3 మనస్సునందు ఊహించుట. 4 పంచభూతములసంబంధమైన. 5 ప్రాణము, లేకజ్ఞానము, లేకచలనము లేని. 6 వస్తువులయొక్కసమ్మేళనము (కూడిక). 7 అభావము (లేనిది.)

బదార్థసం[1]యోగము; మఱి,సంయోగమంటే, తిరిగి యెప్పు డో [2]భావికాలమున క్షయమును బొందునదే యని యర్థము. కావున, నాత్మ సృష్టింపఁబడినయెడల,దానికి నాశ నముకూడఁదప్పదు. కాఁబట్టి యాత్మసృజింపఁబడినదికాదు. మఱియుఁ గొందఱు, సుందరములగు శరీరములు, బుద్ధి బలము, సర్వాంగపుష్టియునొంది సుఖవంతులయి జన్మించి సంపూర్ణారోగ్యమును ననుభవింతురు. అన్యులు [3]దుఃఖ భాగులై పుట్టుదురు; అందుఁ గొందఱు కాలుసేతులులేని వారు; కొందఱు పుట్టువెఱ్ఱులు, వివేకహీనులునై జీవనము మహాకష్టముగ వెళ్లఁబుచ్చుచు, దైన్యతనొంది పెనఁగులాడు చుందురు. ఏమికారణము? వారెల్లరు సృజింపఁబడియుండిన పక్షమున, [4]న్యాయైకపరుఁడును, దయామయుండు నగు భగవంతుఁడు, సుఖిగానొకరిని దుఃఖిగామఱొకరిని సృజిం చునా? అతఁ డంతపక్షపాతియా? అదిగాక, యీజన్మము నందుఁ గష్టపడినవారలు ముందుజన్మమునఁ బూర్ణముగ సుఖింతు రనుకొందమన్నను వీసమైన మనశంకవదలనేలేదు; ధర్మపరుఁడును గరుణాశీలుండును నగుపరమేశ్వరుని పరిపా లనమందు [5]నీపుట్టుకయందుమాత్రము మనుజుఁడు దుఃఖ భాగియేలకావలయును? ఇదియునుంగాక, భగవంతుఁడు 'సృష్టికర్త' యనినందువలన నభిప్రాయమేమి? [6]సృష్టివైపరీత్య

1. కూడిక. 2. రాఁబోవు. 3. దుఃఖమును బొందువారై. 4. న్యాయమే ముఖ్యముగఁజూచువాఁడు, 5. జన్మమే. 6. విరుద్ధకార్య ములు.

ములకుఁ గారణ [1]మొండు చెప్పయత్నించుటకని యెంత మాత్రము తలంపరాదు, సర్వశక్తిమంత మగుదైవ[2]విఘటనమనిమాత్రము చెప్పవచ్చునేకాని మఱొకకారణమునీకవకాశమియ్యదు. కాఁబట్టి, చూడఁగానే దీనికి శాస్త్రముతోఁ [3]బ్రసక్తిలేదని [4]తెల్లమే. ఇఁక, మనుష్యుఁడు దాననుభవించుకష్టసుఖములవిషయమై, తన యీజన్మమునకుఁ బూర్వమే కారణము లుండితీరవలయును. ఈకారణములు దాను స్వయముగ జన్మాంతరమునఁ జేసికొన్నకర్మములే.

వంశపరంపరా సంబంధము.

మానసికశారీరకధర్మములు తల్లిదండ్రులస్వభావస్వరూపములనుబట్టి సంతతివారలకుఁ [5]బరంపరఁగా సరిటి వచ్చుచుండు నని చెప్పరా? ఇచ్చట సమదూరరేఖలోయున రెండుస్థితిగతులుగలవు. మానసిక మొకటి; [6]ఆధిభౌతికము మఱియొకటి; మనోవ్యాపారముగలది యొకటి, [7]ద్రవ్యసంబంధము గలది మఱొకటి. ద్రవ్యమును, ద్రవ్యము చెందురూపాంతరములునుమాత్రమే 'మన'దనుదానికంతకును సరియైన సమాధానమగునేని, నాత్మ యొండుకలదని యూహింపఁ బనియే గానరాదు. కాని మనస్సంబంధియగునాలోచనాశక్తి [8]ప్రకృతినుండి బయల్వెడలెననుటకు హేతువును [9]నిరూపింప

1 ఒకటి. 2 ఎడఁబాటు. 3 సంబంధము. 4 స్పష్టమే. 5 వంశక్రమమున. 6 పంచభూతములందుండునది. 7 పదార్థ. 8 జడము. 9 సమూలముగఁజెప్పలేము.

లేము. ఇదిగాక, తత్వశాస్త్రప్రకారము '[1]ఏకమేవాఽద్వితీయ' మ్మను[2]నేకేశ్వరభావము తప్ప[3]కుండిన యెడల, [4]ఆధ్యాత్మికేశ్వరత్వముకూడ విధిగా [5]లోకాయతికమత మంతయుక్తియుక్తమే; దీనికంటెఁ దక్కువయభీష్టమైనట్టిది య్యును గాదు. పోనిందు; వీనిలో నేదియుఁ [6]బ్రకృతమున కక్కఱలేదు.

**పూర్వజన్మసంస్కారము.**

శరీరములకు వంశక్రమముగఁ గొన్నిగుణములు లభించునని యొప్పుకొం మనము; గాని [7]యీపారంపర్యము శరీరాకారమునకుమాత్రమే సంబంధించును; అట్టిశరీరమునుండి యొకానొక మనోధర్మముత్పన్నమగును; ఆమనస్సునం దట్టివిశేష గుణము [8]సంక్రమించుటకుఁ దనదు[9]పురాకృతకర్మములే కారణము. జన్మాంతరవాసనగలయాత్మ [10]స్వజాతిసంబంధవశమునఁ దా నావాసన నగపఱచుట కత్యంతసాధనమైన దేహమునందే జనించును. ఈగుణము పూర్ణముగ శాస్త్రసమ్మతమే; ఎందు

---

1 ఏకమేవ=ఒక్కఁడే, (దైవము), అద్వితీయం = రెండవది లేదు. 2 ఈశ్వరుఁ డొక్కఁడే యనుతలంపు. 3 అవశ్యకమైనచో (అనఁగా నిజముగ దేవుఁ డొక్కఁడే యుండునేని). 4 ఆత్మయం దుండు నీశ్వరత్వము. 5 నాస్తికమతము. 6 ఇచ్చటిసందర్భమునం దు. 7 క్రమముగ వచ్చునది. 8 కలియుటకు. 9 పూర్వజన్మమున చేసికొన్న. 10 'యోగ్యం యోగ్యేనయుజ్యతే'. అనఁగా, ఆత్మ తన మునుపటివాసనను బ్రకటించుకొనుటకు ఏది యర్హమో, అట్టిశరీరమునే కలియుచున్నది.

చేతననఁగా, నేవస్తువయినను నభ్యాసమువలననే యగునని శాస్త్రము విశదీకరించును; అట్టియభ్యాసము మఱలమఱలఁ జేయుఁ బ్రయత్నించుటవలన సిద్ధించును. దీనినిబట్టియే, యప్పుడుపుట్టినశిశువున కప్పుడే నిజస్వభావము లంకురించుటకీపౌనః[1]పున్యమే కారణమని యూహింపవలసియున్నది. ఈ స్వభావములెల్ల యీజన్మమునందే [2]యలవడినవికావు గావున, నవి పూర్వజన్మవాసనవలననే వచ్చితీరవలయును.

ఇంకొక శంక తోఁచుచున్నది; ఇదంతయు నిశ్చయమగునేని, నాపూర్వజన్మవృత్తాంత మేదియు నాకు జ్ఞప్తికిరా

జన్మాంతరస్మృతి.

దేమి? ఈశంకను సులభముగాఁ దీర్ప వచ్చును. ఇప్పుడు [3]నే నింగ్లీషుమాట్లాడుచున్నాఁడను. ఇది నామాతృభాషగాదు. వాస్తవముగా నామాతృభాషాపదము లేవియు నాబుద్ధియందుఁ బ్రకృతము గన్పట్టవు. కాని యొక్కక్షణమాత్రము వానిని స్మరింపఁ జూచెదనా, యవి [4]శరపరంపరలుగ వచ్చిపడును. ఇందువలన నేమిదెలియునంటే, చైతన్యము మానససముద్రముయొక్క [5]యుపరిభాగమనియు, మనయనుభవములన్నియు దానిలోఁతులందుఁ బ్రోవుపడియున్నవనియును విశదమగుచున్నది. యత్నమొమాత్రము సేయుఁడు, బింకముగఁ బోరాడుఁడు.

---

1 మరలమరలఁజేయు నభ్యాసమే. 2 వచ్చినవి. 3 వివేకానందస్వామి. 4 బాణములొకటి వెంబడినొకటి వేవేగఁ బోవునట్లు. 5 పైభాగము.

అవన్నియుఁ దిరిగివచ్చును. మీపూర్వజన్మచరితములుకూడ మీకు జ్ఞాపకమునకురాఁగలవు.

ఇదే సూటిగఁ జెప్పునట్టి చక్కనినిదర్శనము. ఏవాదమునకైనను బ్రత్యక్షానుభవమునకు సరిపడునదియే పరమప్రమాణము. ఇదిగో పందెమొడ్డి ఋషులు లోకమందంతటను జాటుచున్నారు.— "మేము [1]స్మృతిమహాంబుధిలోఁతుల నడుగంటఁగదలించురహస్యమును గనుగొంటిమి. అందుకొఱకు యత్నము సేయుఁడు, మీపూర్వజన్మవృత్తాంతములు పరిపూర్తిగ మీకు జ్ఞప్తికివచ్చును." ఇందువలననే హైందవుఁడు దా[2]నాత్మస్వరూపమని నమ్మును.

"[3]అవ్వానిని ఖడ్గము ఖండింపనేరదు. అవ్వానిని వహ్ని దహింపఁదగదు. అవ్వానిని జలము గరఁగింపఁజాలదు. అవ్వానిని గాలి యెండింపలేదు." ప్రతిజీవాత్మయు నొక [4]వలయమనియు, దానినడుము దేహమునందుఁ బ్రతిష్ఠింపఁబడినను దానికిఁ [5]గైవారమెచ్చటను గానరాదనియును హిందువులు నమ్ముదురు; మఱియు మృత్యువనఁగా నీవలయమధ్య మొకశరీరమునుండి మఱియొకశరీరమునకు మాఱుచుండుటయే యని వారియభిప్రాయము. ఆత్మ, జడపదార్థము

1 జ్ఞాపకమను మహాసముద్రము. 2 పరమాత్మయొక్క అంశము. 3 'నైనం ఛిన్దంతి శస్త్రాణి నైనందహతిపావకః । నచైనం క్లేదయన్త్యాపో నశోషయతిమారుతః'(భగవద్గీత.) 4 కుండలాకారము. 5 మట్టు అంచు.

లచే బంధింపఁబడినదియునుగాదు. అది సహజముగా స్వతంత్రమైనది, బంధములు లేనిది, పవిత్రమైనది, స్వచ్ఛమైనది, పరిపూర్ణమైనది. కాని యెటులనో! యేలయో! తాను ప్రకృతిచే బద్ధమని తెలిసికొని శరీరమే తా నని భావించుకొనుచుండును.

[1]స్వేచ్ఛ, [2]పూర్ణత, [3]స్వచ్ఛతగలజీవుఁడు జడప్రకృతికిట్లు దాసుఁడై పడియుండనేల? అనునది తరువాతిశంక. సంపూర్ణునకుఁ దానసంపూర్ణుఁడనుకొనుట కెట్లు

ఆత్మకు శరీరసంబంధము.

భ్రమింపశక్యమగును? హిందువులు తారీ ప్రశ్నమునకుజంకి "అఖ్యదడుగరాదు" అని చెప్పునని మాత్రోఁ గొందఱనిరి. విచారణాశీలురుకొందఱు సంపూర్ణ[4]ప్రాయులయిన యొక్కరుఁడో పెక్కండ్రో జీవులను నిర్ధారణచేయుచు సమాధానింపఁగోరి, లోపము లగపడకుండఁగ శాస్త్ర జటిలములగు పెద్దపదములనుపయోగించుచుందురు. కాని పేర్కొనుట [5]విశదీకరించుటకాదు. ప్రశ్న మటులనే మాఱకయుండెను. సంపూర్ణుని సంపూర్ణతుల్యుఁడన నెట్లుశక్యమగును? నిర్మలమై సంపూర్ణమగుపదార్థమునకు నిజస్వభావమునందలి పరమాణువు పరిమాణముగల [6]కణమైనను మార్పుచెందుటెట్లు? కాని భారతీయుఁడు బహు

1 పరాపేక్షలేమి, కర్మబద్ధముగామి. 2 దైవగుణముల లోపము లేకుండుట, పరమాత్మసాదృశ్యము. 3 మాలిన్యమును బొరసియని తేజస్సు; బ్రహ్మవర్చస్సు. 4 సమాను లనఁదగు. 5 విషయము మనసునకునాటునట్లు వివరించుట. 6 లేశము.

నిష్కపటమైన [1]సద్భావముగలవాఁడు. అతఁడు [2]కుతర్కమున [3]మఱుఁగుపడుటకిష్టపడఁడు ; [4]మగతనమున వాదము నెదిరి నిలువఁజాలుధైర్యశాలి. వానిసమాధాన మేమనఁగా, "సంపూర్ణాత్మ తనను అసంపూర్ణునిగను [5]విషయసాంగత్య నిర్బంధములలోఁ జిక్కువడినవానిగను తానెట్లుఁదలంచుకొన వలసివచ్చెనో, నాకుఁ దెలియదు. కాని, అదెంత తెలియకున్నను [6]యథార్థము యథార్థమేగద. తనను దాను శరీరముగాభావించుకొనుట ప్రతివాఁడును దథ్యముగఁ దనమనమునం[7]దనుకొనుచుండునదే." అది యట్లుండుటకుఁ గారణమేమో, శరీరములో నొకం డుండుటేలకో యతఁడు బోధింపఁబూనఁడు. అది యీశ్వరసంకల్పమని చెప్పుసమాధానము కూడ వివరణము కానేరదు. "నేనెఱుంగను" అని హైందవుఁడు వచియించినదానికంటె నిందు విశేషమేమియును గానంబడదు.

జన్మ రాహిత్యము.

సరే, మానవజీవము నిత్యము, నాశనరహితము, సంపూర్ణము, ననంతమునైనదే; మరణమనఁగాఁ జక్రమధ్యమువలెనుండు జీవము; దేహమునుండి దేహమునకుమాఱుచుండుటయే. పూర్వజన్మమున మనము చేసికొన్నకర్మములే మనవర్త

1 మంచిమనస్సు. 2 కుచ్ఛితచర్చ. 3 దాఁగుకొనుటకు. 4 పౌరుషముతో. 5 ఇంద్రియములతో సంయోగము గలిగి కట్టువడియుండుట. 6 కారణము తెలియనంతమాత్రమున వస్తువే లేదనుట సత్యమనిపించుకో లేదని యర్థము. 7 'నేను చనిపోవుదును' అనునపుడు 'నేను' అనగా శరీరమే యని వానితలంపు.

మానస్థితిని [1]నిర్ణయించుచున్నవి; ఇప్పుడు చేయుచున్నవి భావిస్థితిని నేర్పఱచును. ఆత్మ జన్మజన్మమునకును మృత్యువు మృత్యువునకును క్రమముగ [2]ముందునకు సాగుచునో, లేదా [3]తిరిగి వెనుకఁబడుచునో, సంసారమునందే తిరుగాడు చుండును. కాని యిచట మఱియొకశంక గలుగుచున్నది. మనుజుఁడు [4]ఝంఝూవాతమునందు సముద్రతరంగముల మీఁదఁ గొట్టుకొనుచుండు చిన్నదోనెయేనా? నురుఁగుతోఁ బొంగిపై కెగయు కెరటములమీఁదనొకక్షణము తేలుచు, నుత్తరక్షణముననే [5]యావలించు [6]జలాగాధములంబడి తనశుభాశుభకర్మములకు[7]లోనై [8]కడలియలల నిటునటు [9]నిరంతరము [10]పొరలాడుచుండు నొకయా మనుజుఁడు? లేదా, 'మొడతెగక [11]యుద్రేకించుచు, మీఁదికిఁ జొరఁబడుచు, వెనుదీయక త్రోసికొనిపడునట్టి [12]కార్యకారణరూపమగు మహాప్రవాహములో దుర్బలమును నిరాధారమునగు పాడుపడవయా? లేకున్న, దారిలోఁ గ్రిందఁబడిన పానినెల్లయును నలఁగఁ ద్రొక్కుచుఁ, బతులం గోలుపోయినసతుల కన్నీరుగానక,

1 ప్రస్తుతము మన మనుభవించువానికిఁ గారణము లగుచున్నవి. 2 అభివృద్ధినొందుమనో. 3 క్షీణించుచునో. 4 వానగాలి. 5 పంగటించు. 6 నీటిలోఁతులంబడి. 7 అధీనమై. 8 సముద్రతరంగముల 9 ఎల్లప్పుడు. 10 పొర్లుచుండు, ఊఁగాడు. 11 విజృంభించుచు. 12 కార్యమగుటకు ముందు కారణ ముండితీరును; కారణము కార్యమును బూచుచునేయుండును; కావున నిరంతరసంబంధముగలిగి ముందును వెనుకను బడుచుండు కార్యకారణప్రవాహమునందలి పడవ.

తల్లిదండ్రులులేనిబిడ్డల యేడ్పు నాలింపక దొరలుచున్న సృష్టి చక్రము క్రిందనున్న చిమ్మటపురుగా? అకటా! తలఁచుకొనిన హృదయము[1]కుంగిలుచున్నది. అయినను జేయున దేమియు లేదు, ప్రకృతిధర్మమట్లుండెను. ఏమియు నాశ లేదా? ముక్తి సాధన మేదియులభింపదా ? యనునార్తధ్వని [2]నిరాశావిష్టములగు హృదయాంతరాళములనుండి వెల్వడలుచుండెను. ఈమొఱ [3]పరమదయాపదమునకు వినఁబడెను. అంతట, సుఖాశాజనకములును, దుఃఖోపశమనములునగు నభయవాక్యములు చెవిసోఁకి, వేదఋషిని ప్రేరేపింప నతండు నిలువంబడి యెలుగెత్తి సింగపుబొబ్బతో లోకమునకంతకును నీసంతోషవార్తను జాటెను.— "వినుఁడు; [4]నిత్యానందస్వ

1 దిగఁబడు, కృశించు. 2 ఆశలేని. 3 దయామయుండగుభగవంతునకు. 4 "శృణ్వంతు విశ్వే అమృతస్యపుత్రా ఆయేధామాని దివ్యానితస్థుః । వేదాహ మేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ తమేవ విదిత్వాతి మృత్యుమేతి । నాన్యః పన్థా విద్యతే ఽయనాయ."

అర్థము.—అమృతస్య=అమృతస్వరూపుఁడగు భగవంతునియొక్క, విశ్వే=అందఱు, పుత్రాః = బిడ్డలారా ! శృణ్వన్తు = వినుఁడు. ఆయే=ఈ, దివ్యాని= ప్రకాశించునట్టి, ధామాని=స్థానములను, తస్థుః=ఆశ్రయించినవారలారా ! (అని యర్థము.), ఆదిత్యవర్ణం=సూర్యతేజస్సుగల, తమసః=చీఁకటికంటె, పరస్తాత్=భిన్నమైన, మహాన్తం=గొప్పవాఁడైన, ఏతం=ఈ, పురుషం=దేవుని, అహం=నేను, వేద=తెలిసికొన్నాఁడను. తమేవ=వానినే, విదిత్వా = తెలిసికొని, మృత్యుం = మరణమును, అత్యేతి (అతి + ఏతి) = అతిక్రమించును.

రూపునిబిడ్డలారా!దివ్యస్థాననివాసులారా!మీరును వినుండు. తమోఽతీతుండును భ్రమాతీతుండు నగునాపురాణపురుషుని నేనుగనుగొంటిని. వానినే తెలిసికొని మీరు చీటికిమాటికిఁ గలిగెడి యీమరణావస్థనుండి సేవింపఁబడుదురు." "నిత్యానందస్వరూపునిబిడ్డలారా!"—ఎంతమధురమైన నామమో! ఎంత యాశగొలుపునామమో! సోదరులారా! 'నిత్యానంద స్వరూపుని[1]వారసులు'అనునీమధురనామముతో మిమ్ములను బిలవనిండు. హా! భారతీయుఁడు మిమ్ముఁ బాపాత్ములనుగఁ బిల్వ[2]నోర్వఁడు. మీరలు భగవంతునిపిల్లలరు; నిత్యానందమునకు భాగస్వాములరు;పవిత్రసంపూర్ణ జీవాత్మలరు;మీరు భూలోక దేవతలరు. పాపాత్ములా?మనుష్యు నట్లుపిలుచుట యే పాపము. మానవు లెల్లరకును, మహావమానకరమగు దూషణము. సింగములారా!పైకిరండు; మీరు గొఱ్ఱెలనుభ్రాంతిని విదలింపుఁడు; మీరు నాశనమెఱుఁగనియాత్మలరు. మీరు [3]జడులరుగారు, మీరు శరీరములరుగారు; జడమైన ప్రకృతి మీకుదాసి; మీరుగారు ప్రకృతికి దాసిసలరు.

ఇదేవిధముగ వేదములుఘోషించును; దేనిని?[4]క్షమారహిత భయంకరశాసనసమ్మేళనమునుగాదు, కార్యకారణ

(నరుఁడు), అయనాయ=మోక్షమునకు, అన్యః=మఱియొక, పన్థాః=మార్గము, న విద్యతే=లేదు.

1 కొడుకులు. 2 సహింపఁడు. 3 అచేతనములు. 4 ఓర్పులేని భయమును గలిగించు చట్టములకలయిక.

రూపమైన[1]యపారకారాగృహామునుగాదు. కాని యీసమ

ఈశ్వర స్వభావము

స్తశాసనములకుఁ బ్రభువైనవాఁడును, బ్రకృతిశక్తుల ప్రతిపరమాణువులోపలను వెలుపలను వెలుంగువాఁడును, నొకండుగలఁడనియును, [2]నతనియానతివలన భూమండలమున గాలివీచుచు, నిప్పు రగులుచు, మబ్బులు కురియుచు, మరణము చరియించుచునుండెననియును వేదములు ఘోషించును. అట్టివాని స్వభావమేమి? అతఁడు సర్వవ్యాపి, నిర్మలుఁడు, రూపరహితుఁడు, సర్వశక్తిమంతుఁడు, దయామయుఁడు. "[3]నీవే మా తండ్రివి; నీవేమాతల్లివి; నీవే మాప్రియమిత్రుఁడవు; నీవే సర్వశక్తికి మూలాధారుఁడవు; మాకుశక్తినిమ్ము. ప్రపంచ భారమునెల్ల మోయువాఁడవునీవే, ఈజీవముయొక్క చిన్న బరువును మోయుట మాకు సాయపడుము!" అని వేదజ్ఞులు గానముచేసిరి. అతనిని మనము భజియించుటెట్లు? భక్తిచేత. "ఈజన్మమునఁగాని రాఁబోవుజన్మమునందుఁగాని యన్నింటి

1 దరిలేని చెఱసాల. 2 శ్లో. భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతిసూర్యః, భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతిపంచమః. అనఁగా, ఇతని (దేవుని) భయమువలన అగ్ని మండును; (ఇతని) భయమువలన ఇంద్రుఁడును వాయువును (వర్షించును, వీచును) అయిదవ వాఁడగు మృత్యువు పఱుగిడును. ఈశ్లోకాభిప్రాయమునే పైమాటలు స్ఫురింపఁజేయును. 3 శ్లో. పితాత్వం మాతాత్వం దయితతనయస్త్వం ప్రియసుహృత్, త్వమేవ త్వం మిత్రం గురురసిగతిశ్చాసిజగతామ్,

కంటె నెక్కుడు ప్రియుఁడైన [1]యొక్కఁడుగ మనము వానిని బూజింపవలయును.

వేదములందుఁ బ్రతిపాదింపఁబడునట్టి భక్తియోగ మిదియె. భూలోకమునం దవతరించిన భగవంతుఁడని హిందువులు నమ్మిన శ్రీకృష్ణునిచే, ని దెంతసంపూర్ణముగ వివరింపఁబడి యుపదేశింపఁబడెనో చూతము.

మనుజుఁడు, నీటిలోఁ బెఱిగినను నీటిచే నెన్నండును దడియని తామరాకువలె, నీప్రపంచమునందు జీవయాత్రను సలుపవలయునని శ్రీకృష్ణుఁ డుపదేశించెను. కావున మానవుండు భూమియం దట్లే సంచరింపవలయును.—తన[2]హస్తములను గర్మాధీనముగను, దనహృదయమును నీశ్వరాధీనముగను జేయవలయును.

ముక్తి మార్గము.

ఇహలోకమునఁగాని పరలోకమునఁగాని ఫలము

---

త్వదీయస్త్వదభృత్యస్త్వపరిజనస్త్వద్గతిరహమ్, ప్రపన్నశ్చైవంసత్యాహమపి తవైవాస్మి హిభరః." అనఁగా, తండ్రివి, తల్లివి, భార్యవు, కుమారుఁడవు, ప్రియస్నేహితుఁడవునునీవే; మిత్రుఁడవు, గురుఁడవు, జగద్గతివియు నీవే, నేను నీవాఁడను, నీభృత్యుఁడను, నీపరిచారకుఁడను, నీవు గతిగలవాఁడను; నే నిట్లాప్రకారముగానే పడియుండినప్పటికిని భారముగుచున్నాఁడనుగదా. 1 ఒకవస్తువుగ. 2 తనహస్తములచే పనులను జేయుచున్నను హృదయము ఈశ్వరునియందు లగింపవలయునని యర్థము. రామకృష్ణపరమహంస.—"నీళ్లకుండను నెత్తిమీఁదఁబెట్టుకొని పోయుచుఁ దనతోటివారితో మాటాడుచున్నను, యువతి తన

నాశించి దేవుని భజించుట యుక్తమగునుగాని, యితరఫలాపేక్షలేక కేవలభగవదారాధనమేఫలముగా భజించుట సర్వోత్తమము. [1]"ఈశ్వరా, నేను ధనమునుగోరను, విద్యనపేక్షింపను; సంతానమును స్మరింపను. నీయిష్టమేని, గష్టశతములనైన [2]నోర్తును; కాని దీనినిమాత్రము నాకుఁ[3]బ్రసాదింపుము.— భక్త్యైకబుద్ధితో నిష్కపటముగను [4]నిరాసంగముగను నిన్ను సేవించునట్లుమాత్రము నన్ననుగ్రహింపుము" అని ధ్యానశ్లోకముదనరారు. శ్రీకృష్ణుని ప్రియశిష్యుండును నప్పటిభరతదేశచక్రవర్తియు నగుయుధిష్ఠిరుండు శత్రువులచేఁ [5]బరాజితుఁడై స్వరాజ్యమును[6]గోలుపోయి, భార్యతో హిమాలయపర్వతములం దొకయడవిలో శరణునొందవలసివచ్చెను. అచ్చట వాని నొకరోజున "నీవు పరమధార్మికోత్తముఁడవై

భక్తి

నిట్లకుండపై నెట్లు ధ్యానముంచునో, అట్లే నగుఁడు తాను ప్రపంచమునందుండి సంసారముచేయుచున్నను, సదా భగవంతునిపై ధ్యానముంచవలయును." అని వచించెను. 1 శ్లో. "నధనం నజనం నసుందరీం కవితాం వా జగదీశకామయే, మమజన్మని జన్మనీశ్వరే భవతాత్ భక్తిరహైతుకీ త్వయి." అనఁగా, ఓజగదీశ! నేను ధనమును కాని, జనమును (సంతానము మొ॥) గాని సుందరకవిత్వమునుగాని కోరనుకాని ప్రతిజన్మమునందును నాకు ఈశ్వరుఁడవైన నీయందు నిర్హేతుకమైన భక్తి పొసఁగుఁగాక. 2 సహింతును. 3 అనుగ్రహింపుము. 4 ఫలాసక్తి లేకుండ. 5 ఓడింపఁబడినవాఁడై. 6 పోఁగొట్టుకొని.

యుండియు నీవింతదుఃఖ మేలయనుభవింపవలసివచ్చెను? " అని రాణి ప్రశ్నించెను. అంతటఁ జక్రవర్తి [1]"ప్రాణేశ్వరీ, హిమాలయపర్వతములను జూడుము. [2]ఎంతమహత్తుగ నెంతరమ్యముగనున్నవో! వానిజూడ నాకుఁ గడుఁబ్రీతి. అవి నాకేమియునీయ్యవు; కాని యుదారములును రమణీయములు నగువానిని బ్రేమించుట నాస్వభావము; గనుక, నేను [3]మన సార వానిని బ్రేమించెదను. ఆలాగుననే, నేను భగవంతుని భజియింతును; అతఁడు సౌందర్యమునకెల్ల యునికిపట్టు; ఔన్నత్యమునకెల్ల [4]పట్టుకొమ్మ. సేవింపఁదగిన పరమవస్తువతండే, మఱొండుకాదు. అతనినిబూజించుట నాస్వభావము, గనుక నేను భజియింతును. నే నేపదార్థమును బ్రార్థింపను; నే నెద్దానినిగాని యడుగను. యతఁడు దన [5]యిచ్ఛవచ్చినచోట నెచ్చటనైనను, నన్నుంచునుగాక; నీట

1 శ్లో. నాహం ధర్మఫలాకాఙ్క్షీ రాజపుత్రి చరామ్యుత, దదామి దేయమిత్యేవ యజేయష్టవ్యమిత్యుత, ధర్మ ఏవమనః కృష్ణే స్వభావాచ్చైవమేధృతమ్, ధర్మవాణిజ్యకో హీనో జఘన్యోధర్మవాదినామ్. మహాభారతము, వనపర్వము, 31-వ అధ్యాయము తాత్పర్యము. రాజపుత్రీ ! నేను ఫలమునుగోరి ధర్మము నాచరించుటలేదు ; కాని యియ్యఁదగినదని దానమిచ్చుచున్నాఁడను, యజ్ఞము చేయఁదగినదని యజ్ఞముచేయుచున్నాను ; కృష్ణునియందు ధ్యానముంచుట ధర్మమే యని స్వభావమువలననే చేయుచుంటిని; ధర్మమును అమ్ముకొని బ్రదుకువాఁడు నీచుఁడు, ధర్మవాదులలోనెల్ల అధముఁడు (నింద్యుఁడు).
2 ఘనముగ. 3 తృప్తిదీరునట్లు. 4 ఆధారము. 5 ఇష్టము.

ముంచినను బాలముంచిననుసరే; నిశ్చలభక్తిగలిగి నిన్నుం గుఁడనై వానినిగొలుతును. నేను లాభనష్టములఁ బరికించి భక్తిన రక్తమును బెట్టఁజాలను" అని మాఱుపలికెను.

ఆత్మ భగవత్స్వరూపమనియుఁ, బ్రకృతిబంధమునకు మాత్రము గట్టువడియుండెననియు, బంధములు తెగి, విడి పోవునపుడు [1]పరమోత్కృష్టపదవి ప్రాప్తిం చుననియును వేదము లుపదేశించుచున్నవి. అందువలననే యీమహాపదవిని ముక్తియ నియ్కు మోక్షమనియు వ్యవహరింతురు:—అనఁగా స్వచ్ఛం దత, కర్మబంధములనుండి విమోచనము, మృత్యుదుఃఖ ములనుండి నివారణము.

ముక్తి నిరూపణము.

ఈకర్మబంధము భగవంతుని కటాక్షమువలననే ఛేదింపఁబడును. అట్టికారుణ్యము పరిశుద్ధాత్ములకే లభిం చును. కావునఁ జిత్తశుద్ధియే భగవదనుగ్ర హమునకుఁ [2]పాత్రమగును. [3]బాపురే! దయారసమెట్టుప్రసరించుచుండెనో! అతండు పరిశుద్ధహృదయులకుఁ దానై సాక్షాత్కరించును. నిర్మలుం డును నిష్కళంకుండు నగునరుండు భగవంతుని-ఎప్పుడో కా దు-ఈజన్మమునందే చూడఁగల్గునుగదా! అప్పుడుమాత్రమే, యప్పుడే [4]హృదయకౌటిల్యమంతయుఁ దిన్ననగును; అపుడు

హిందు మతసారము.

1 అన్నిటికంటె గొప్పపదవి. 2 యోగ్యము. 3 ప్రశంసను దెలుపును. 4 కృత్రిమము.

సర్వసంశయవిచ్ఛేదమగును. మానవుం డంతట, ఘోరము లగు[1]జననశాసనముల కెన్నండును నాటబొమ్మగా నేరఁడు. ఇదియే హిందుమతమున [2]కాయువుపట్టు, గుండెకాయ, ప్రాణాధార మగుప్రధానభావన. భారతీయునకు మాటల తోడను వాదములతోడను బ్రదుకఁబనిలేదు. సాధారణేంద్రియగ్రాహ్యములకంటెఁ [3]బరతత్త్వము లుండునేని నతఁడు వాని నెదుర్కొని ముఖాముఖి పోరాడును; [4]విషయాభిన్నంబయిన జీవాత్మయొండు తనయం దుండునేని, దయాసింధు[5]వగు[6]సర్వతోముఖమునపరమాత్మ యొండుగలఁడేని దిన్నఁగ నతనియెదుటికిఁ బోవును. భగవాను నతఁడు చూచితీరవలయును. అంతతోఁగాని సంశయమెల్లయు నిర్మూలముగాదు. కాఁబట్టి యాత్మవిషయమై, యీశ్వరవిషయమై హైందవ యోగిచెప్పునట్టి మహాప్రమాణ మేమందురా, [7]"నేను బరమాత్మనుజూచితిని, నేను భగవంతుని దర్శించితిని" అనియే. పరమాత్మప్రాప్తికి కదేలక్షణము. హిందుమతమునందు నిరర్థకవాగ్వాదములును, నిర్హేతుకమూఢబోధనములును గానరావు; కాని సాక్షాత్కారసాధనమే; హిందుమతము దేనిని విశ్వసింపమనదుగాని సాధించి యనుభవమునకుఁ దెమ్మని బోధించును.

---

1 పుట్టుక. 2 మర్మస్థానము. 3 గొప్పసత్యములు. 4 ఇంద్రియములకంటె వేఱయిన. 5 సముద్రము. 6 అంతట ప్రవహించెడు. 7 'వేదాహమేతం పురుషం మహాన్తమ్'—వేదము.

ఇవ్విధమున, వారిమతమునందలి యుద్దేశమంతయు నిరంతర ప్రయాసమున సంపూర్ణజ్ఞానమును సంపాదించి, దివ్యత్వమును బొంది, భగవంతునిజేరి భగవంతుని గనులారఁ జూచుటయే. తనను సృజియించినయీశ్వరుఁ డెట్లు సంపూర్ణుఁడో, దేవునిడగ్గరి దర్శించి యట్లు సంపూర్ణ[1]తను నరుఁడు గనుటయే హిందుమతమై వెలయును.

ఇఁక సంపూర్ణతనుబొందిన మనుజునిస్థితి యేమి? అతఁ డఖండానందజీవన మనుభవించును; అతఁ డనంత సంపూర్ణానందమును గ్రోలును — దేవుని సాక్షాత్కరించుకొని నరుఁడు దా ననుభవింపగవలసినసుఖ మిదియే — భగవంతునితోఁగూడి యాబ్రహ్మానందమును బొందును. ఇంతవఱకు హిందువులందఱు నేకీభవింతురు. హిందూదేశమునందలి మతములకన్నింటికి నిది [2]సామాన్యమతము.

నిజమైన సౌఖ్యము.

కాని యిప్పుడీ శంక పుట్టుచున్నది.— సంపూర్ణత్వ మఖండమగునది; ఈయఖండతకు రెండుమూడను [3]ఖండ వ్యవహార ముండనేరదు. దాని [4]కేగుణములు నుండనోపవు.

1 ఏవిధమునఁజూచినను లేశమైనను లోపములేమి. 2 ఏమార్గముచేనైన నీశ్వర సాక్షాత్కారము చేసికొనుట. 3 ఖండమనఁగా వస్తువులలో నొకభాగము; ఇట్టిభాగము లనేకములు కావచ్చును. గావున నవి రెండు మూడు నూరు, కోటియనుగణనగలవి. ఇట్టిగణనాతీతమైనదే యఖండవస్తువు. 4 సత్వరజస్తమఆదిగుణములు.

అదొక[1]వ్యక్తి కాఁజాలదు. *కాఁబట్టి జీవాత్మ, సంపూర్ణ త్వము నఖండత్వమును జెందునపుడు, అయ్యది బ్రహ్మము తో నైక్యముకావలసియుండును; మఱియు నీశ్వరుని స్వత్వ ముగను సంపూర్ణుఁడుగను [2]స్వస్వభావసత్వములు గలవాని గను దెలిసికొనును—నిరంకుశ నిష్కళంక సచ్చిదానంద మూర్తియని గుర్తించును.—దీనినిగుఱించి మనము మాటి మాటికిని †వ్యక్తినాశనమనియు, నది తాయిగ్గానో రప్పగా నో యగుననియును బలికించుచుంటిమి. గాయ మెన్నండు నెఱుంగనివాఁడు పుచ్చులనుజూచి పరిహసించును.

అట్టిస్థితియేమియుఁగాదు; చెప్పెద వినుండు.—ఈ యల్పశరీరములోని [3]చైతన్యము నెఱుంగుట సుఖమగు నేని,

---

1 రూపముగలది. 2 ప్రకృతిపురుషు లను రెండుఅంశములుగల వాఁడు. ప్రకృతి లేక మాయవలన సృష్టియంతయు గలుగుచుండును. కాని మాయపురుషునిగలసి సృష్టికిఁ గారణమగును. (భగవద్గీత 12-వ అధ్యాయము చూడుఁడు.— ప్రకృతి పురుష విభాగ యోగము). 3 జీవాత. * 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి.'—బ్రహ్మమును దెలిసి కొన్నతర్వాత ఆత్మ బ్రహ్మమునందే కలిసిపోవును. † బ్రహ్మైక్య ము నెఱుంగని యజ్ఞానులు వ్యక్తినశించి పిదప మన్నో, తాయియో, రప్పయోయగును, గావి సాయుజ్యమెట్లుగల్గునని పరిహసింతురు. అం దులకు స్వామి చక్కఁగ నచ్చునట్టి సమాధానమిచ్చెను. —వ్రణము నెప్పుడు అనుభవించనివానికి పుచ్చునుజూచిన నవ్వగనుండును. అట్లే దేవుని చూచి యెఱుఁగనివాఁడు దైవసాక్షాత్కారము నాక్షేపించు చుండును.

రెండుశరీరములలోని చైతన్యమును దెలియుట సుఖతరము కావలయును; ఇట్లే, క్రమముగ శరీరములసంఖ్య హెచ్చిన కొలఁది నందుఁగల చైతన్యముతోడనే సుఖపరిమితికూడ హెచ్చుచుండును. కావున నంతిమోద్దేశమగు సుఖపరిణామము సకలజగచ్చైతన్యమునెఱింగినపుడే లభించును.

కాఁబట్టి, యనంతమైనయీవిశ్వమంతయు నేననే జ్ఞానమును (అనఁగా బ్రహ్మజ్ఞానమును) సంపాదింపవలయు నన్న, దుఃఖ[1]భాజకమగు కారాగృహమును బోలు నీయల్పశరీరమునందలి యహంభావము మాసిపోవలయును. అప్పుడు, నేనాత్మ[2]సాయుజ్యమును బొందునప్పుడే, మృత్యువు నశించును; అప్పుడు, నేనానందైక్యమును బడయునపడే దుఃఖము నశించును; అప్పుడు, నేను జిద్రూపముతో నేకీభవించునప్పుడే సకలదోషములు నశించును. ఇదియే కావలసియున్న శాస్త్రసమ్మత మగు పరిష్కారము. శరీరాహంభావము కేవలము భ్రాంతియనియుఁ, [3]దత్త్వమరయ, నాయొడలు ప్రకృతియనెడునవిచ్ఛి[4]న్నమహోదధియందు నిరంతరవికార

బ్రహ్మైక్యము

1 దుఃఖమును గలిగించు. 2 బ్రహ్మైక్యము. 3 యథార్థము. 4 ఎడ తెగని మహాసముద్రము. అనఁగా శరీరము పృథివీసమ్బంధమే గావునఁ బుట్టుచు గిట్టుచు ఎల్లపుడును వికారములను బొందుచునే యుండును; ఆత్మ అట్లుగాదు; ఆత్మ చివరకు పరిపక్వమై దేహములను చాలించి బ్రహ్మైక్యమును బొందునని భావము.

ముల నొందుచున్న యల్పశరీర మొక్కండేయనియు, నా రెండవ ప్రతిరూపమగు జీవాత్మతో ముఖ్యపరిసమాప్తి [1]యద్వైతమే (అనఁగా బ్రహ్మైక్యము) యనియును నాకు విజ్ఞానశాస్త్రము నిరూపించుచున్నయది.

శాస్త్రమనఁగా వేఱొండుగాదు; అద్వైతమును గనుంగొనుటయే, బ్రహ్మసాధనమే. ఏశాస్త్రమైనను సంపూర్ణా[2]వధిని బొందఁగానే, దానిపురోభివృద్ధి శాంతింపవలసి యుండును;ఏలయన నెంతవఱ కది యభివృద్ధికాఁదగియుండు నో యంతపర్యంతము నభివృద్ధిపూర్తియైనచో నటుపైని వృద్ధియుండదు; అంతతో నిలిచిపోవును. చూడుఁడు; రసవాదశాస్త్రము, ఏమూలద్రవ్యముచే మిగిలినపదార్థములన్నియుఁ జేయఁబడునో,దాని నొకపరి దెలిసికొన్నతర్వాత నంతకంటె ముందుకు సాగిపోఁజాలదు; అదియే దాని చరమావధి. ప్రకృతిశాస్త్రము, ప్రకృతిశక్తులన్నియు నేమూలాధారశక్తియొక్క వికారస్వరూపములే యగునో యట్టి శక్తిని సాధించి తనకార్యము నెఱవేర్పఁగల్గినపిదప ముందునకుఁ గొనలుసాగింపనేరక యాగిపోవును. మతవిద్యకూడ, మహాజగత్ప్రళయమునందే యాత్మ [3]పసిమిచెడక నిలిచియుండునో, సదా వికారమునుబొందుచుండు ప్రపంచమునకంతకు నెవండు నిత్యాధారభూతుండో,సమస్తజీవాత్మలు నేపర

1 జీవేశ్వరుల కైక్యముబోధించు మతము. 2 హద్దు. 3 కాంతివిహీనముగాక.

మాత్మయొక్క భ్రమాత్మకస్వరూపములో యా[1]పరాత్పరుని దెలిసికొనఁగానే, సంపూర్తియగును. ఇటులనే [2]బహుత్వద్వై[3]తములద్వారా కాని కడపటిదైన యద్వైతము సిద్ధింపదు. మత మింతకంటె వృద్ధికానేరదు. శాస్త్రము[4]పై శాస్త్రము మరలమరల గ [5]వేషించినను, సకలజ్ఞానమునకును గమ్యస్థానమిదియే.

ఎల్లశాస్త్రములు, తుద కీ[6]పర్యవసానమునకే రాక తీరదు. ఇంద్రియగోచరమగు[7]వస్తుజాతమంతియు నొకమూలాధారశక్తియొక్క [8]వ్యక్తిస్వరూపములే కాని క్రొత్తసృష్టి గాదనియే శాస్త్రము బోధించుచుండెను. భారతీయుఁడుదాను దరతరములనుండి తనహృదయమున నమ్ముచున్నదియే, యిపుడు మఱింత ప్రబలభావతో నవీనశాస్త్ర[9]పరిష్కారములవలనఁ గలుగు మఱింతబుద్ధివికాసముతో, నేర్పఁబడుచున్నదని మాత్రము పొంగుచున్నాఁడు.

ప్రపంచము క్రొత్తదికాదు.

వేదాంతమహాశయములనుండి యిపుడు పామరమతమునకు దిగిచూతము. భారతదేశమునందు బహుదేవతలను

1 ఈశ్వరుని. 2 అనేకత్వవాదము. 3 జీవాత్మ పరమాత్మలకు భేదముగల్పించు మతము. 4 ఒకశాస్త్రముతరువాత మఱియొకశాస్త్రము. 5 వెదకినను. 6 ఫలితమునకే. 7 వస్తుసముదాయము. 8 జాతికానిది — ఉదా. గోవు వ్యక్తిస్వరూపము, గోత్వము (గోజాతి) జాతిస్వరూపము. 9 సిద్ధాంతములు.

పామరబోధ. నమ్మునట్టిమతమే లేదని నేను మున్ముందుగనే చెప్పఁగలను. ప్రతిదేవాలయమునందును, నెవండుగాని, ప్రక్కనునిలువంబడి చెవియొగ్గివినినయెడల, నర్చకులు సర్వవ్యాపకత్వము లోనుగాఁగల భగవన్నామ గుణాతిశయముల నన్నింటిని విగ్రహములయెడఁ బ్రయోగింపఁ గనుంగొనును. ఇయ్యది బహుదేవతార్చనమతము గాదు; అదిగాక, దేవతలు పెక్కండ్రు కల్గి యందొకని [1]నధిదైవతముగ నమ్ము (అధిదైవతమతము) మతమన్నను వలను పడదు. "గులాబిపుష్పమును మఱేపేరుపెట్టిపిలిచినను యథాపూర్వముగనే మధురముగఁ బరిమళించును." నామములు సమా[2]ధానములు కావు.

నాచిన్నతనమునం దొకప్పుడు క్రైస్తవమతబోధకుం డొకఁడు హిందూదేశమునం దొకజనసంఘమున కుపదేశించుచుండఁగా వినినట్లు నాకు జ్ఞాపకము. వారలకుఁ జక్కని సంగతులనుజెప్పుచు నడుమ "నాబెత్తముతో మీాविగ్రహమునుగొట్టినచో నదేమిసేయఁగల్గును?" అని ప్రశ్నింప వెంటనే యాసంఘమునం దొక్కఁడు తటాలున "మీా దేవునిం నిందించినయెడల నతఁడేమిసేయఁగలాఁడు" అని యెదిరించెను. ఉపదేశికుఁ డంతట "నీవుమరణించినప్పుడు

1 ఇష్టదైవమనియు కుటుంబదైవమనియు జనులు వ్యవహరింతురు. 2 సందేహములు తీర్చునవి.

శిక్షింపఁబడుదువు" అని బదులుపలికెను. "అటువలెనే నా విగ్రహము నీవుమరణించినపుడు వచ్చి నిన్నుశిక్షించును." అని హైందవుం డెత్తిపొడిచెను. పండ్లవలనఁగదా చెట్టునకుఁ బ్రతీతివచ్చును. విగ్రహారాధకులని వాడుకపడిన వారలలోఁ గొందఱను బ్రత్యక్షముగఁజూచియుంటిని. నీతిమతభక్తివిషయముల వారలకుసాటి నేనెచ్చటనైననుగానను; అంతఁ గొంతతాళి నాలో నేనిట్లు తర్కించుకొందును.— "పాపమువలనఁ బూజ్యతగల్గునా?"

మూఢభక్తి; విగ్రహారాధనము.

మూఢభక్తి మానవునకు గొప్పశత్రువు; మతదురభిమానము దానికంటెను బెద్దది. క్రైస్తవుఁడు గుడి కెంమలకుఁ బోవలయును? అచటి మతచిహ్నమగు [1]'శిలువ' యేల పవిత్రమైనది? ధ్యాన సమయమున మొగము నాకసమువంకఁ ద్రిప్పుటేటికి? [2]'కాథలిక్' దేవళమందుఁ బెక్కువిగ్రహము లున్న వేమి? 'ప్రొటెస్టెంటు'ల మనస్సులలో ధ్యానవేళయం దనేకాకృతులేర్పడఁ గారణమేమి? ప్రియసోదరులారా,

---

1 క్రీస్తును బంధించి చంపిన + గుర్తుగలకొయ్య, శత్రువులిట్లుచంపినను బ్రజలపాపముల నతఁ డనుభవించి మూఁడవరోజున బ్రదికి లేచెనని చెప్పుదురు. 2 'కాథలిక్' మతము, ప్రొటెస్టెంటు మతమును క్రిస్టియనుమతములే. మొదటిది 'రోమనురాజ్యమప్పటి నుండియుఁగలదు; రెండవది దీనికి వ్యతిరిక్తముగఁ గొన్ని విషయములను జర్చించి తిరుగుబాటొనరించినది. 3 ప్రతిమలు.

మన మూపిరివిడువకుండ నెట్లుండలేమో, యట్లే మానసిక ప్రతిమ లేర్పడకుండ దేనినిగాని యాలోచింపఁజాలము. [1]సంసర్గవిశేషమువలన మూర్తిమంతమగు విగ్రహము మనోభావము నుదయింపఁజేయును; అట్టి మనోభావన విగ్రహమునందు దృష్టినిలుపును; ఇట్లు రెండును బరస్పరసాపేక్షకములగుచున్నవి. కావుననే హైందవుఁడు పూజవేళ బాహ్యచిహ్నము నుపయోగపఱచును;తాను ధ్యానించుపరమాత్మపైఁ దనమనస్సును నిశ్చలముగనిలుపుట కది సాయపడునని మీకుఁ దెలియఁజెప్పును. విగ్రహము దేవుఁడుకాదనియు సర్వవ్యాపికాదనియును మీఁకుదెలియునట్టె యతనికిసి దెలియును. ఇంతేల? చాలమందిజనులకు, నిజముగ రమారమి ప్రపంచమునకంతకును, సర్వవ్యాపకత్వ మెంతకొలగలదని బోధపడును? ఊఱకయే, యదొకమాట, యొకగుర్తుగా మాత్రము కనఁబడును. దేవుఁడు ప్రత్య[2]క్షప్రమేయుండా? కానిచో,మనము సర్వవ్యాపియనుమాట ననువ[3]దించునపుడు మనము విస్తరించియుండు నాకాశమునో యవకాశమునో (నభోమండలమునో భూమండలమునో) యంతవఱకే తలపోయుదుము.

1 సంయోగము—మనసు విగ్రహమునందు లగించుట. 2 ఇట్టివాఁడనియు నింతవాఁడనియును, సాక్షాత్తుగ నెఱుంగ శక్యుఁడా యనిభావము. 3 ఆవృత్తిచేయు, మరలఁజెప్పు.

ఏదో యొకవిధమున, [1]మనోనిష్ఠ వ్యాపారధర్మము లచే, నప్రమేయతను భావ[2]నచేయుటకు, నీలాకాశము యొక్క యాకారముతోడనో, మహాసముద్రముయొక్క రూపముతోడనో పోల్చుకొని, మనయభిప్రాయములను సరి పెట్టుకోవలసియుండును. అదేరీతిగ మనము పవిత్రతను భావనసేయుటకు దేవాలయము యొక్కయో 'మ[3]సీదు' యొక్కయో లేక 'శిలువ'యొక్కయో ప్రతిమతో మనస్సు ను ల[4]గ్నముచేయుట స్వభావమైయున్నది. హిందువులు పవిత్రతను, బరిశుద్ధతను, సత్యమును, సర్వవ్యాపకతను, మఱియు నిట్టియితరభావములను వేఱువేఱు ప్రతిమలతోడను వేర్వేఱురూపములతోడను సంబంధింపఁ జేయుచుండిరి. కాని యీభేదముగలదు; ఇతరులు తమజీవితమునంతను దమ యాలయప్రతిమకొలకే ధారవోయుచుందురు, వా రంతకంటెఁ బయికిలేవరు; ఎందుచేతనంటే, మతమనఁగా వారికభిమతమైన యేవో కొన్నిసిద్ధాంతములను సమర్థించి సాధించుటకుఁ దగిన జ్ఞానసంపాదనయును, దమతోడిజనుల కుఁగావలయు నుపకారము నొనరించుటయును; వారి కిదియే మతము. హిందుమతమన్ననో యట్లుగాదు; హిందు మతముయీవత్తు దైవసాధనయే పరమార్థముగ నెంచును. మనుష్యుఁడు దాను బరబ్రహ్మమును సాక్షాత్కరించుకొని

1 మనసునందుగల క్రియాగుణములు. 2 ఊహించుటకు. 3 తురకలగుడి. 4 తగిలించుట.

బ్రహ్మాత్వమునే పొందవలసియున్నది; ఆలయములు, విగ్రహములు, మందిరములు, గ్రంథములును వాని[1]యాధ్యాత్మికబాల్యమునందుఁగల్గు నూఁత[2]కంబములే, సహాకారులు మాత్రమే కాని యతం డుత్తరోత్తరాభివృద్ధి గనుచునే యుండవలయును.

అతం డెచ్చటఁగాని నిలువరాదు. "[3]బాహ్యపూజ, ప్రతిమార్చనము చిట్టచివరిదశ; అభ్యుదయముకొఱకుఁ బోరుచు మానసికధ్యాన మొనరించుటమధ్యనుదశ; ఉత్తమదశ యీశ్వరుఁడు ప్రసన్నుఁడైనపుడే" యని వేదములు ప్రతిపాదించుచున్నవి. పరికింపుఁడు; విగ్రహాభిముఖుఁడై మోఁ[4]కటించునట్టి యానిశ్చలభక్తుఁడే మీకిట్లునివేదించును.—"[5]సూర్యచంద్రనక్షత్రము లతనిని (భగవంతుని) గనుపింపఁజాలవు;

అధ్యాత్మిక దశావిభాగము.

1 ఆత్మవలనఁ గలిగిన. 2 సాహాయ్యముచేయు స్తంభములే.
3 శ్లో. ఉత్తమో బ్రహ్మ సద్భావో ధ్యానభావస్తు మధ్యమః, స్తుతిర్జపో౽ధమాభావో బహిఃపూజా ౽ధమాధమా.— మహానిర్వాణతంత్రము 4-వ ఉల్లాసము. అనఁగా 'బ్రహ్మసాక్షాత్కారము ఉత్తమము, మానసికపూజ మధ్యమము; స్తోత్రజపములు అధమము, బాహ్యపూజమిక్కిలి అధమము' అని యర్థము. 4 మోఁకాళ్లను నేల కాని నమస్కరించు. 5 శ్లో. న తత్ర సూర్యోభాతి, న చంద్ర తారకమ్, నేమా విద్యుతోభాంతి, కుతో౽యమగ్నిః, తమేవభాన్తం అనుభాతిసర్వమ్, తస్యభాసా సర్వ మిదం విభాతి.— కఠోపనిషత్తు. అనఁగా.—అచ్చట, సూర్యుఁడు ప్రకాశింపనేరఁడు; చంద్రుఁడు న

ఆ మెఱపైనఁగూడ నతని నగుపఱపలేదు ; ఏల! ఆ యగ్ని హోత్రుఁడే చాలఁడు: ఆమహామహునిద్వారా యివన్నియుఁ దేజరిల్లుచున్నవిగా." అయినను నతఁ డెవ్వనివిగ్రహము ను దూషింపఁడు; [1]తదారాధనము పాపమని పేర్కొనఁడు. అందు జీవయాత్ర కవసరమగు నొకదశ యతని కెఱుకపడు చుండును. "[2]బాలుండే మనుజునితండ్రి" బాల్యము పాపమనిగాని, యౌవనము పాపమనిగాని చెప్పుట వృద్ధునికి న్యాయ్యమా ?

జీవయాత్ర.

ఇదియుఁ గాక, హిందుమతమునందుఁ బ్రతిమల నుపయోగింపవలయు నను నిర్బంధము లేదు, సరి, పోనిండు ; విగ్రహాముయొక్క సాహాయ్యముచే మనుజుఁడు సులభతరముగఁ దనబ్రహ్మ తత్త్వమును దాను దెలిసికొనఁ గల్గునేని, దాని నంతమాత్రమునఁ బాపకార్యమని పలుకుట [3]పాడియా? అతం డామెట్టును దాఁటినను గూడ, దాని నతం డు తప్పిదమనరాదు. హిందువుని కిది సిదానము; జీవుని ప్రవృత్తి

క్షత్రములును వెలుఁగవు ; ఈ మెఱపులు మెఱయవు, అగ్నిమాత్ర మెట్లు?; ప్రకాశించుచున్న వాని ననుసరించి యన్నియును బ్రకాశించును; ఈసమస్తమును అతని కాంతిచేతనే వెలుంగుచున్నది. 1 విగ్రహపూజ. 2 అనఁగా బాలుఁడే వయసుముదిరినకొలఁదిఁ బెఱిగి పెద్ద వాఁడగుచుండును. 3 న్యాయ్యమా ?

[1]మార్గము సత్యమునుండి సత్యమునకేగానియనృతమానుండి సత్యమునకుఁగాదు. నిమ్నసత్యమునుండి యున్నతసత్యమునకుమాత్రమే. అట్టడుగు బహిఃపూజమొదలుకొని మహోన్నతంబగు బ్రహ్మ[2]సద్భావమువఱకును గలమతములన్నియు మానవజీవముయొక్క ప్రయత్నములేయని యతనియుద్దేశము; ఈ ప్రయత్నములు శ్రీమదనంతుని దెలిసికొని యతనిని సందర్శించుటకే: ప్రతిప్రయత్నమును జీవముయొక్క జనన సహవాసములనుబట్టి యేర్పడుచుండును. ప్రతిప్రయత్నము నొక్కయభ్యుదయసోపానము నాశించుచుండును. ప్రతియాత్మయుఁ గడుంగడు వీర్యమునుబోసికొనుచుఁ దేజోమయుండగు సూర్యనారాయణుని జేరువఱకుఁ బై పై కెగురుచున్న జవ్వనపుగరుడపక్షియై తనరు.

[3]అనేకత్వమునం దేకత్వజ్ఞానము ప్రకృతినిర్మాణమై యున్నది; దీనిని హైందవుఁడు గ్రహించెను. మిగిలిన ప్రతిమతమును నేనో కొన్నినియతధర్మములను[4]శాసించి, వాని

---

1 జీవము తక్కువజన్మమునుండి పుణ్యకర్మములచే గొప్పజన్మము నొందుచు క్రమముగ నభివృద్ధిగాంచుట ప్రవృత్తిమార్గము. అట్లు అనేకజన్మములనెత్తి ఉత్తరోత్తరవృద్ధిచే మానవజన్మమొంది సన్మార్గుఁడై యీశ్వరసద్భావమునకు యత్నించుట నివృత్తిమార్గము. 2 ఈశ్వరసాయుజ్యము. 3 ప్రకృతియందు అనేకమతములు వస్తువులు మున్నగున వగుపడుచున్నను ఈశ్వరుఁ డొక్కఁడేయనియు జగత్తంతయు మాయాస్వరూపమనియు నుత్తమ జ్ఞానము కలుగుచున్నది. 4 ఆజ్ఞాపించి.

నవలంబింపవలయునని ప్రజలనెల్లను నిర్బంధింపఁబూనును; సంఘమునకంతకు నొక్క చే[1]కంచుకమునేర్పఱచి యదియే పిన్నకుఁ బెద్దకుఁ, బేదకు [2]సాదుకు నెల్లరకు నొకేమాదిరి సరిపుచ్చవలయు ననును. అది యెవనికైనను దీర్చినట్లు సరిపడదేని, నతఁడు శరీరాచ్ఛాదనమునకు నంగీలేకుండఁగ సంచరింపవలసినదే. [3]పూర్ణతత్త్వమును బడయవలెనన్నను, యోజింపవలెనన్నను, నిరూపింపవలయునన్నను, [4]త త్త్వసంబంధము వల్లనమాత్రమే శక్యమగుననియు, విగ్రహములు, శిలువలు' [5]అర్ధవలయములును గేవలము సంజ్ఞలనియు; నాస్తిభావమును దగిలించుకొను పలుమేకులనియును హిందువులు కనుంగొనిరి. ప్రతిమానవునకు నీసాహాయ్య మావశ్యకము కాదు. కాని పలువురకదే సరియైనమార్గము. అది తమకు నక్కఱలేనివారలుకూడ నది తప్పుమార్గమనిచెప్పుటకు వీలులేదు.

అనేకత్వమునం దేకత్వజ్ఞానము.

మీకొకవిషయము ముచ్చటింపవలసియున్నది.— భరతఖండమున విగ్రహారాధనమంటే [6]భయానకమేమియుఁ

1 చొక్కాయి. 2 సాధువునకు. 3 పరమార్థగతిని. 4 ప్రకృతివికారములును పురుషవికారములును గలసి ప్రపంచసృష్టియగును గావున నా రెంటియొక్క స్వభావవిశేషములచే తగినసమ్మేళనము కలుగుచుండును. 5 అర్ధచంద్రాకృతిగల యొకగుర్తు. 6 భయపడవలసినది.

గాదు. అది [1]కులటలకుఁ దల్లిగాదు. కాని,[2]గొప్ప యాధ్యాత్మికతత్వములను సులభముగ గ్రహించుటకుగాను బరిపక్వముగానిమనసుగలవారు చేయుప్రయత్నము. హిందువులకుఁ దప్పిదములుగలవు; కొన్నివేళల వారలకు నిషేధములునుగలవు; అయినను దీనిని గమనింపుఁడు. వారలు సదా తమదేహములనే శిక్షించుకొనఁగడంగుదురు; ఎన్నండును దనుపొరుగువారల గొంతుకలు గోయఁజూడరు. హిందుమతాభిని వేశి [3]చిచ్చుటికి స్వయముగఁ దనను దాను దహించుకొనుగాక; గాని యతఁ డెప్పుడును [4]మతాచారవిచారణాగ్నిని బ్రజ్వలింపఁజేయఁడు. అగ్నికుండములందు మంత్రకర్తలను గాల్చుట క్రైస్తవునకు దోషమనుట ధర్మముగాదు; కాని యింతకంటె నెక్కుడగుశదోషముకాదు హిందువు చిచ్చుచచ్చుట.

అన్యమత సహనము.

ఇట్లు, హైందవునకు మతప్రపంచమెల్లయు నొక ప్రయాణముమాత్రమే. వివిధ[5]సంస్కారములనొప్పు స్త్రీపురుషులు పలువిధములగు నవస్థలను స్థితిగతులను ననుభ

1 లంజెలకు. 2 ఆత్మవలనగలుగు సత్యములను. 3 అగ్నిని ప్రవేశించి. 4 కొన్ని క్రైస్తులదేశములలో Inquisition అను విచారణసభగలదు. వీని యాజ్ఞప్రకారము జనులు తమ మతాచారములను సంప్రతించుకొనననిచో కూ్రరదండనలకు పాతు్రలగుదురు. అట్టి కూ్రరత్వము మన మతమునలేదు. 5 కర్మసంబంధములు.

వించుచుఁ జివర కొక్కటే గమ్యస్థానమును జేరుటయే హైందవుని మతము. ప్రతిమతము[1] పాంచభౌతికుండగు మనుష్యునినుండి భగవంతుని వీడఁజేయుటయే ; ఆభగవంతుఁడే సకల మతములకుఁ బ్రేరకుఁడై వెలుంగుచుండును. అట్లయిన నేల యిన్ని పరస్పరవిరోధములుగలవు ? అవి కేవలము [2]విరోధాభాసములని హైందవుఁడనును. అట్టివిరోధములు భిన్నభిన్న స్వభావములు గలస్థితిగతుల ననుసరించుచు, నొకేసత్యమునుండి యుత్పన్నములగుచున్నవి.

*గమ్యస్థాన మొక్కటే.*

అయ్యది పలురంగులుగలయద్దములలోనుండి వచ్చునట్టి యొక్కటే తేజస్సు. ఈస్వల్పభేదములు [3]నానాప్రకృతులను బొసఁగించుట కావశ్యకములు. కాని ప్రతివస్తువుయొక్క హృదయాంతరాళమునఁ బొదలుచున్నసత్య మొక్కటియే. భగవంతుఁడు దాను శ్రీకృష్ణావతారంబున నిట్లు ప్రకటించెను.-

*దేవుఁడన్ని మతములఁ గలఁడు.*

1 శరీరము పంచభూతములచే నిర్మితమైనను, అందు ఆత్మ కలిగియుచున్నది. అట్టి ఆత్మకు శరీరసంబంధ మెన్నటికి గలుగకుండఁజేయుటయే ముక్తి. 2 విరోధములువలె తోఁచును గాని నిజముగ విరోధములుకావు. 3 పలువిధములగు స్వభావములను యథోచితముగఁ గూర్చుట.

* "ముత్యాలహారము నందంతటను దారమున్నట్లు నేను బ్రతిమతమునను వెలయుచుంటిని. మానవులందఱ [1]సంధకారమునుండి లేవనెత్తుచుఁ బరిశుద్ధాత్ములను జేయుచు నెచ్చ యెచ్చట నసాధారణమైన పవిత్రతయు, నసాధారణమైన శక్తి యును నీకగపడునో యచ్చట నేనున్నాఁడ నని తెలిసికొనుము." దీనిఫలితార్థమేమి? హిందువులుమాత్రమే ముక్తి నొందుదురు; ఇతరులు పొందరని యర్థమిచ్చునట్టి యేవాక్యమువయినను, సంస్కృతవేదా[2]న్తదర్శనమునంతను వడియఁ గట్టి వెదకి [3]యెరయినఁబో [4]కనుంగొనఁ గాల్గివివి ప్రపంచమునకు వాయించుచున్నాఁడ. వేదవ్యాసుఁడు, [5]"అస్మజ్జాతిమతకోటికి వెలుపలంగూడఁ బూర్ణజ్ఞానులు గలరు" అని వచియించెను. మఱియొక్కసంగతి.—ఆపక్షమునఁ దనభావనాస్వరూపమంతయు భగవంతునియందే లగ్నముసేయుభారతీయుఁడు, దేవుఁడున్నది లేనిదియుఁ దెలియ

*శ్లో. మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా,
త త్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్.

అనఁగా దారమునందు మణిగణములు గుచ్చఁబడినట్లు నాయందు ఈసమస్తము నిమిడియున్నది. ఏదేది ఆశ్చర్యైశ్వర్యములతో శోభాయమానమై యుండునో దానిని నాతేజోభాగములవలనఁ బుట్టినదిగా గ్రహింపుము. 1. అజ్ఞానము. 2 శాస్త్రము. 3 ఎవరైననుసరే. 4 చూచుటకు. 5 'అన్తరాచాపి తద్దృష్టేః' వేదాంతసూత్రము.

లేమను బౌద్ధమతమును, దేవుఁడు లేఁడుపోయను జైనమత మున్ను నెట్లు విశ్వసింపఁగలఁడు?

బౌద్ధులును జైనులును నీశ్వరాశ్రయులుగారు; గాకున్ననేమి? వారిమతమునందలి సత్తువయంతయు, మనుష్యునిలోనుండు దేవుని బయల్వెట్టుటయును సర్వసిద్ధాన్త మహాసత్యమునకు [1]సుముఖముగనే యున్నది. వారు తండ్రి నిజూడరు, కాని [2]కుమారునిజూచిరి. కొమరునిజూచినవారలు దండ్రినిగూడఁ జూచినవారలే.

సహోదరులారా! యియ్యది హిందువుల మతాభిప్రాయముల సంగ్రహము. హైందవుఁడు తనయుద్దేముల నన్నింటిని నెఱవేర్పఁజాలకున్నను, సర్వసామాన్యమతమెన్నండైనఁ గల్గునేని, నది దేశకాలాతీతమై పొగడొందకతీరదు. ఎవ్వని తేజస్సు కృష్ణానుసరులమీఁదను, క్రీస్తనుగతులమీఁదను, బావనులమీఁదను, బాపులమీఁదను సమానముగఁ బ్రకాశించునో యట్టి, తాబోధించు భగవంతునివలెనే, యదియు ననంతమైనది; బ్రాహ్మణమతముకాదు, బౌద్ధము గాదు, పఠాణముగాదు, మహమ్మదీయముగాదు, కాని వీని యన్నింటియొక్కయు [3]సంకలనరాశి; అనంతమైనను నింకనుదా నభివృద్ధినొందుటకు ననంతమైన యవకాశమును బొందు

1 అనుకూలము. 2 క్రైస్తవులు 'యేసు' భగవంతుని కొడుకని చెప్పుదురు. బౌద్ధజైనులకు కొంచె మీపోలికగలదని సూచన. 3 మొత్తము.

పఱచుకొనుచునేయున్నది; అయ్యది [1]తనవిశ్వంభరత్వము వలనఁ దనయనంతబాహువులమధ్యమున, బ్రతిమానవుని గౌఁగలించుకొని వాని కాధారమును గలిగించును; అయ్యది, పశుప్రాయులై యధమాధములయిన యడవిమనుష్యులను, మఱియు, [2]మేధాశక్తిని, [3]నంతఃకరణప్రవృత్తులచేతను నించు మించు [4]మానవాతీతుఁడై ప్రజలనందఱను దనయెడల భయభక్తులుగలవానినిగను, దనమానవప్రకృతిని సంశయించువారినిగను జేసికొని [5]మేటియై వఱలు మహానుభావునిఁ గూడ, భేదమునుజూపక సమానముగ నాదరించునట్టి మహామతము; మఱియు నియ్యది తనధర్మశాసనములందు హింసకుఁగాని యసహనమునకుఁగాని [6]యెడమియ్యని మతము. స్త్రీపురుషులందఱియందును గలపరమాత్మ నెఱింగినయట్టిది; తన [7]యావత్సత్త్వమును దనయావచ్ఛక్తిని, మానవజాతియంతయుఁ దనసత్యమయిన [8]దైవీప్రకృతిని సాక్షాత్కరించుకొనులాగునఁ దోడ్పడునట్టి మహామతము.

అట్టిమతమును [9]బెట్టుఁడు; అంతట సకలజాతులును మిమ్ముల ననుసరించును. అశోకునిసభ కేవలము, బౌద్ధమత

1 లోకమునంతను భరించుట. 2 బుద్ధిబలముచేతను. 3 మానసిక ప్రయత్నములచేతను. 4 మానవులను మించినవాఁడై.— దేవతాంశజుఁడై. 5 అధికుఁడై. 6 అవకాశము. 7 దీనియర్థమే తరువాతి పదము చెప్పుచున్నది ; ద్విరుక్తి దృఢీకరణముకొరకు. 8 మాయాప్రకృతికంటె భిన్నమైనది. 9 కల్పింపుఁడు.

ప్రచారకసభ; అక్బరు నిది [1]మహత్తరమైనను నొకసంస్థాన సంఘమే. ఇఁక భగవంతుఁడు ప్రతిమత మునందును గలఁ డని లోకమున దిక్కు లెల్ల మ్రోఁగునట్లు ప్రకటింప నమెరికాకు విడువంబడెను.

ప్రశంసా వాక్యములు.

హిందువులకు [2]బ్రహ్మమైనట్టియు, జొరాస్ట్రియను లకు [3]'అహురామజ్డా' యైనట్టియు, బౌద్ధులకు బుద్ధదే వుఁడయినట్టియు, యూదులకు 'యెహోవా' యైనట్టియు, క్రైస్తవులకు [4]స్వర్గపితయైనట్టియు నాభగవంతుండు మీకు మీయుదారమహాశయమును గొనసాగింప బలమునిచ్చు గావుత. [5]ఈనక్షత్రము తూర్పున నుదయించెను; అది తిన్నఁగాఁ బశ్చిమమునకుఁ బ్రయాణమయ్యెను. ఇయ్యది యొ కప్పుడు కాంతివిహీనముగుచు నొకప్పుడు దేజరిల్లుచుఁ బ్రపం

1 అంతకంటె గొప్పదైనను. 2 నిర్గుణపరబ్రహ్మము. 3 పర దేవతానామములు. 4 స్వర్గమునందుండు తండ్రి. 5 వెనుకటివాక్య ములోని 'యుదారమహాశయ మ'నే నక్షత్రము; అనఁగా భగవం తుఁడు ప్రతిమతమునందును గలఁడుగావున మతములన్నియు సోదర భావమువహించి పరస్పరమైత్రిని బరస్పరానురాగమును గలిగి యైక మత్యముతోఁ జరియించుచు నొండొరులు తమ కావశ్యకములయిన కార్యములందు సాహాయ్యము నొనరించుకొనుచు న్యాయమార్గాను సరులై యుండిన దేవుఁడు అందఱను బిడ్డలుగఁజూచి మోక్ష మొసంగునని యుపదేశముచేయు మహామతము.

చమునంతను జుట్టివచ్చి, మునుపటికంటె వేయిమడుంగు [1]లధిక తేజః పుంజముగలిగి దేదీప్యమానమగుచు, పూరల [2]నాప్రాగ్దిఙ్మండలమునందే [3]'టసిపు' సరిహద్దుల నుదయించు చున్నది.

మేలు, కొలంబియా దేశమా, స్వాతంత్ర్యమునకు మాతృభూమీ, నీకు శుభము! నీకేయొసంగినారు :—నీ వేనాఁడును [4]నీసన్నిహితుల రక్తపాతముచే నీహస్తములను దడిపియెఱుఁగవు. భాగ్యవంతుఁడగుటకుఁ దనచెంతవారల నెల్లరను గొల్లఁబెట్టుటయే తేలికమార్గమని నీవేనాఁడును దెలిసికొనవు; కావుననే నాగరకత కగ్రేసరవై శాంతిజెం డానుబట్టుకొని ముందంజవేయుటకై యధికారమును నీకే యొసంగినారు.

## 2. స్వాగతమునకుఁ బ్రత్యుత్తరము.

అమెరికాసోదరీసోదరులారా!

మీరు దయతో మనఃపూర్వకముగ మాకొసంగిన స్వాగతమునకు, లేచి ప్రత్యుత్తరమీయ, నాహృదయము చెప్పఁదరముగాని యానందమునఁ బొరలుచున్నది. ప్రపం

1 తేజోరాశి.. 2 తూర్పుదిక్కుప్రదేశమునందు. 3 స్థలనామము. 4 సమీపమునసుండువారల.

చమున వెలయు, పురాణమునిజనులపక్షమున నేను మీకు నమస్కరించుచున్నాఁడను. మతములకుఁ దల్లి పేరను, నేను మీకు నమస్కరించుచున్నాఁడను. సమస్తజాతులతోడను శాఖలతోడను దనరు కోటానఁగోటుల హిందుజనుల పేరను, నేను మీకు నమస్కరించుచున్నాఁడను.'

ప్రాగ్దిశాప్రతినిధులను గుఱించి, 'దూరదేశస్థులగు వీరు, దేశదేశములకుఁ బరమతసహనమును వెల్లడించుగౌరవమున కర్త్యంతార్హు' లని తెలియఁజేయుచు, నీసభావేదికయందు మాట్లాడినవారలకుఁ గూడ నావందనముల నర్పించెదను. పరమతసహనమును, సర్వమతసమ్మతియును, రెండింటిని లోకమునకు బోధించుచున్న మతమునకు, నేను జెందినందులకై, గర్వపడుచుంటిని. మాకు సర్వమతసమ్మతమునందు నమ్మికయేకాదు, సర్వమతములు సత్యములని మేమంగీకరింతుము. ఏమతమును బోధించు పరిశుద్ధమగుసంస్కృతభాషయందు, 'Exclusion' (వేఱుసేయుట) అనుమాటను వచియింపశక్యముకాదో (అనఁగా నేభాషసంస్కరింపఁబడియేమతమునుగాని ద్వేషింపదో) నాయదట్టి మతమని మీకుఁదెలుప గర్వింతును. భూమండలమందుఁగల, సకలజాతిమతముల నిర్బంధోపద్రవములను దప్పించుకొనియు, ననుభవించియు, శరణముగోరి వచ్చినవారినెల్లరను, గాపాడినజాతి మాదనిచెప్ప, నిక్కుచున్నాఁడను. 'రోమను' దౌర్జన్యమువలనఁ దమపవిత్రదేవళము దుత్తునియలుగాఁ దును

మంబడిన యాసంవత్సరమునందే, హతశేషులై దక్షిణహిందుస్థానమునకువచ్చి, మమ్మశరణుఁజొచ్చిన [1]'ఇస్రాయిలెట్' శాఖాపుణ్యాత్ములను, మాజన్ములఁజేర్చుకొని రక్షించినారమని మీకుఁదెలుప, గర్వపడుచుంటిని. [2]'జొరాస్ట్రియను' మహాజాతివిద్వేషములను దప్పించుకొని, మిగిలివచ్చినవారలను బ్రోచి, యిప్పటికిని బోషించుచున్న, యామతమునకుఁ జెందియున్నవాఁడనని పొంగుచుంటిని. సోదరులారా, నేను జిన్నతనమున మొట్టమొదట నుండియు వల్లించినట్టు జ్ఞాపకమున్నయొకమంత్రమును మీకు నుదహరించెదను; ఈ మంత్ర మిప్పటికిఁ బ్రతిదినమును గోట్లకొలఁదిమానవులు వల్లెవేయుచున్నారు. [3]"వివిధస్థలములందుఁబుట్టిన యనేక ప్రవాహములు సముద్రములోఁ గలియునట్లు, ప్రభువా! మనుజులు నానావిధస్వభావములచేఁ ద్రొక్కెడు నానామా

1 క్రైస్తవులలో నొకశాఖవారు. 2 జరదష్టమతము (చూ. 1-వ పుట.) 3 శ్లో. రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషామ్, నృణా మేకోగమ్య స్త్వమసిపయసా మర్ణవఇవ. అనఁగా:— రుచివిశేషములనుబట్టి చక్కనివియును వక్రములును అగుపలువిధముల మార్గముల ననుసరించునరులకు, నదులకు సముద్రమువలెనే, నీవొక్కండవే పొందఁదగినవాఁడవై రక్షించుచున్నాఁడవు. శ్లో॥ ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతిసాగరం । సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి॥ ఆకసమునుండిపడిన జలము సముద్రమును గలియునట్లే, ఎల్లదేవతలకుఁజేసిన నమస్కారము భగవంతునికిఁ జెందును.

ర్గములును, బలు తెఱఁగులైనను, వక్రములగునుగాక, ఋజువు లగునుగాక, యన్నియు నీయొద్దకే యేతెంచుచున్నవి."

"ప్రపంచమునఁగూడిన మహామహనీయపరిషత్తులలో నొంకగు ప్రకృతసభయే, 'భగవద్గీతయం దుపదిష్టమైన యద్భుతసిద్ధాంతము నిర్దుష్ట'మని దృఢపఱచునట్టి సమాధా నముగ నున్నది; ప్రపంచమునకుఁ బ్రకటన; [1]"ఎవరుగాని యేరూపమున నాకడకువచ్చెదరో వారిని నేను గలియుదును; మనుష్యులందఱును జివరకు నన్ను జేరెడుదారులందే పోరు చుండిరి." అవాంతరమతములు, మతదురభిమానములు, వీనికిఁబుట్టిన దారుణ మూర్ఖతలు, నీచక్కనిభూదేవిని జాల కాలము నిండి యనుభవించుచున్నవి; ఇయ్యవి దీనిని బలా త్కారముగఁ బూరించి, మాటిమాటికి మానవ[2]రుధిరంబున దీనిని బట్టి ముంచి, నాగరకతాసంస్కారములను నశింపఁ జేసి, మహాజాతులను [3]విరాగపుఁబెడదారికిఁ బంపినవి. ఈఘోరపిశాచము లావేశింపఁబట్టిగాని లేనియెడల మానవ జాతి యీపాటికిప్పటికంటె నెంతోయున్న తస్థితితోఁ గొప్పగ నుండెడిది; కాని వాటికిఁ [4]గాలమువచ్చినది. ఈమహాసభను గౌరవించుచుఁ బ్రాతఃకాలమున మ్రోఁగినగంట, మతమహా

1 శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్య హమ్, మమవర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థసర్వశః. అనఁగా:—అర్జునా నన్నెవ రెట్లుసేవించెదరో, నేను వారిని నటులనే పొందుదును. సర్వ విధములచేతను మనుష్యులు నామార్గమును అనుసరించెదను. 2 రక్త మున. 3 నిరుత్సాహపఱచినవి. 4 నాశనము సమీపించినది.

మూర్ఖతకంతకును, గత్తిపోటునఁగాని కలముపోటునఁగాని జరగు మతహింసలకన్నింటికిని, నేకగమ్యస్థానమునే చేరఁబోవు మానవజీవాత్మలందుఁ బరస్పరమును బొరయు సోధార్మికబుద్ధులకెల్లకును, నొక్కటే చావుగంటయై పరఁగుఁ గాత.

## 3. బుద్ధిజాడ్యమునకు హేతువు.

నేను మీకొక చిన్నకథను జెప్పెదను. ఇప్పుడే చాలించియున్న యాప్రవక్త "మనమొండొరులము ద్వేషించుకొనుట మానెదము" అని చెప్పినది మీరు వినియున్నారు. 'సర్వదా యింతమతద్వేష ముండవలసినదేనా' యనుచు నతండు మిక్కిలి చింతించెను.

ఈద్వేషమునకుఁ గారణముల నుదహరించునట్టి యొకకథను మీకుఁ జెప్పనగునని తలంతును.—కప్పయొకటి యొకనూతిలోనుండెను. అది చాలకాల మచ్చటనే నివసించియుండెను, అక్కడనే పుట్టినది; అక్కడనే పెరుఁగుచున్నది. ఎప్పటికిని జిన్నకప్పగనే యుండెను. దీనికి నేత్రములున్నవో పోయినవో చెప్పుట కథుడు [1]పరిణామవాదులెవ్వరును లేరు సత్యమేగాని, మనకథకోసము, దాని కవియున్న

[1] దూరదర్శులు:— ప్రతిజీవముయొక్క యవయవాదులను బూర్ణముగ విమర్శించి ప్రకృతిరహస్యములను వెల్లడిచేయుచుందురు.

వనియుఁ బ్రతిదినము నయ్యది నీటిలోనుండుపురుగులను మున్నగువాటిని భక్షించి నీరు శుభ్రపఱచుచున్నదనియే మనము గ్రహించెదము. నీటియందు మసలు పరమాణువులవంటి పుర్వులను భక్షించుటయం దీకప్పలులోనగు జలజంతువులు బహుసమర్థములయినవని బాగుగఁ దెలిసికొన్న యిప్పటి మన సూక్ష్మజంతుశాస్త్రజ్ఞుల ప్రవీణత యెంతయినను బ్రశంసింపఁదగును. ఇట్లుండఁ గొంతకాలమునకుఁ గొంత పుష్టికలదై క్రమముగ రక్తమాంసములుపట్టి కండపెరిఁగి, పొనిండు, నాయంతపెద్దదయినదనుకొందము. అంత నొక నాఁడు సముద్రమునందు వసించుమఱియొకమండూక మక్కడకువచ్చి యానూతిలోఁబడెను.

"ఎచ్చటనుండి వచ్చితివి?"

"సముద్రమునుండి వచ్చుచున్నాఁడను."

"సముద్రమా? ! అదెంతపెద్దది? నాకూప మంతపెద్దదిగనుండునా?" అనుచు నూయిలోనే యొకప్రక్కనుండి రెండవప్రక్కకు దుమికెను.

"మిత్రమా!" సముద్రపుఁగప్పయనెను, "నీచిట్టినుయ్యిని సముద్రమును బోల్చుచుంటివా?"

అపుడు కప్ప మఱియొకసారి గంతుకొని "మీసముద్ర మింతపెద్దదియా?"

"బుద్ధిలేకుండవాఁగెద వేమి? నీనుయ్యితోడనా సముద్రమునుబోల్చుట!"

"కాని" నయిలోనికప్పచెప్పెను "నానూయికంటెఁ బెద్ద దేదియునుండఁజాలదు. లోకమంతయు నవలోకించి నను నింతకంటె గొప్పదిలేదే! ఈనీచుఁడు బొంకులాఁడు. వీనిని వెలుపలకువెళ్లఁగొట్టుఁడు."

చూడఁగా నంతటను నిదేకష్టము వచ్చినది. నేను హైందవుఁడను. నాయింట్లో నేనుగూర్చుండి ప్రపంచమంతయు నాయల్పకూపమే యనుకొనుచున్నాఁడను. క్రైస్తవుఁడును నిదే చేయుచుండెను, ప్రపంచమంతయుఁ దనకూపమే యనుకొన్నాఁడు. తురక తనలోపలఁ గూరుచుండి 'యదేసమస్తప్రపంచమ'ని తలంచును. మాయీచిన్నప్రపంచపునడ్డంకులను గొట్టింపఁబూని, సేయు మీదొడ్డప్రయత్నమునకై, యమెరికావారలగు మీరలు నమస్కరింపఁదగియున్నారు. రేపోమాపో, మీపని కొనసాగింప భగవంతుఁడు మీకుఁ దోడ్పడుఁగాతమని నమ్ముచున్నాఁడను.

## 4. క్రిస్టియను లిండియాకేమిచేయఁగలరు.

క్రిస్టియనులు నిష్కపటముగ మాట్లాడ్పుట కెల్లపుడును సిద్ధముగా నుండవలయును. నేను గొంచెమేమయిన నధిక్షేపించినను మీరది మనస్సులఁ బెట్టుకొందురని తలంపను. అన్యమతస్థులయాత్మల నుద్ధరించునిమిత్తము మత

బోధకుల, నాసక్తితోఁ బంపుదురు. క్రిస్టియనులారా! మీరు ఆహారములేక కృశించుచున్న వారిశరీరములను గాపాడుటకై యేల ప్రయత్నింపరు? హిందుదేశమునందు భయంకరములగు క్షామములుపట్టి యాఁకలిబాధచే వేలకొలఁది పరలోకగతులగుచున్నను, మీరు క్రిస్టియనులని యేమియుఁజేయరైరి. హిందుదేశమునందంతటను మీరు దేవళములను గట్టించుచున్నారు. కాని తూర్పుదిశను మతములేక యేడ్చువారలు లేరు.—వారలకుఁ గావలసినంత మతము గలదు.—మండిపోవుచున్న యిండియాలో, గొంతుకలారి పోవునట్లు విలపించుచున్న కోటానగోట్లు బాధపడుచున్నది రొట్టెకొఱకు; ఆహారముకొఱకుమాత్రమే. వారు మనలను రొట్టెనడుగుచుంటే ఱాలనిచ్చుచుంటిమి. కూటికిలేనిజనులకు మతోపదేశము రోఁతగనుండును. గంజిలేక గుందుచున్న మనుజునికి మతమంటే మంటగనుండును. హిందుదేశమునందు ధనమునాశించి యుపదేశించునట్టి బోధకుఁడు జాతిభ్రష్టుఁడై జనులచే మొగముపై నుమియఁబడును. దారిద్ర్యమునఁ బొగులుచున్నజనులకు సాయమును జేయఁగోరి యిచ్చటకువచ్చినాఁడను; ఇప్పుడు క్రిస్టియనుభూమియందు నన్యమతస్థులు క్రిస్టియనులయుపకారమునుబొందుట యెంత కష్టమో నాకుఁ బూర్తిగఁ దెలిసినది.

## 5. బౌద్ధమతము హిందుమతపూరణము.

మీరువినియున్నది నేను బౌద్ధుఁడనుగాననిఁగదా; అయినను నేను బౌద్ధుఁడనుగూడ నగుదును. చీనా, జపాను, సింహళదేశములు [1]మహాగురూపదేశముల ననుసరించుచుండ, హిందుదేశమువానిని భూమియందవతరించిన భగవంతునిగఁ బూజించుచున్నది. నేనిపుడు బౌద్ధమతమును విమర్శింపఁ బోవుచుంటినని మీరింతవఱకుఁ దలంచుచుందురు; కాని నాయభిప్రాయ మిదియని మీరెఱుంగఁ గోరెదను.—భూమండలమునం దవతారదేవునిగ, నేనుబూజించునట్టి, యామహానుభావుని విమర్శించుట, నాకు బహుదూరముగ నుండుఁగాక. అయినను బుద్ధదేవుఁడు తనశిష్యులకు యథార్థముగ నెఱుకపడలేదని మాయాశయము. హిందుమతము.—అనఁగా వేదమతమని నాయభిప్రాయము—నకును నిప్పుడు బౌద్ధమతమని చెప్పుకొనుదానికిని, గలసంబంధ మేమనఁగా, నించుమించు యూదులమతమునకును క్రిస్టియనుమతమునకును గలసంబంధమే. యేసుక్రీస్తు యూదుఁడు; శాక్యముని హైందవుఁడు. యూదులు యేసుక్రీస్తుని నిరాకరించిరి; అంతేకాదు; 'శిలువ' మీద వెలికిలఁబడవైచి కాలుసేతులంజీలలఁ గొట్టిచంపిరి; కాని శాక్యమునిని హిందువులు భగవంతునిగ నొప్పుకొని శిరమున

---

1 మహాగురువని బుద్ధదేవుని బిలుతురు.

నద్దుకొనిరి. నవీనకాలబౌద్ధమతమునకును, బుద్ధదేవునియుప దేశములుగ, మనము గ్రహింపవలయు దానికిని, హిందువులమయినమేము, చూపఁగోరు నిజమైనభేదము ప్రధానముగ నిందుఁగలదు:—శాక్యముని క్రొత్తదేదియును బోధించుటకవతరింపలేదు. ఆయనయు, యేసువలెనే, మతమును జక్కఁగ నడుపుటకుఁ వచ్చెనుగాని చెడుపుటకు రాలేదు. యేసువిషయమునమాత్రము, తన్నుగ్రహింపనివారు తన పూర్వీకు లగుయూదులు; బుద్ధునివిషయములో నన్నఁ, దనబోధనలప్రాముఖ్యమును దెలిసికొననివారు, తనమతము ననుసరించినవారలే. యూదుఁడు [1]'పాఁతనిబంధన' మేమి నెఱవేర్చెనో యెఱుఁగఁడు; అలాగుననే బౌద్ధుఁడు హిందుమతసత్యములు నెఱవేర్చినవానిని దెలియకుండెను. మరలఁ జెప్పుచుంటిని.—శాక్యముని నశింపఁజేయుటకు రాలేదు; కాని హిందువులమతమునఁ [2]బూరణముగ నుండుటకు, న్యాయసాధకముగఁ బ్రయోగపడుటకు,యుక్తబోధకముగఁ బ్రవర్తించుటకు, భూతలమున కేతెంచెను.

హైందవమతము కర్మకాండమనియు జ్ఞానకాండమనియు రెండుభాగములుగ విభజింపఁబడియున్నది. జ్ఞాన

1 'Old Testament' అనువారి పూర్వమతగ్రంథము. 2 బౌద్ధమతము హిందుమతములోని యొకభాగమే గావున బౌద్ధమతము హిందుమతమున కొకపూరకమయ్యెను. ఒకపండును నాలుగుముక్కలు చేసినపుడు ఒకొక్కముక్క పండునకుఁ బూరకమగుచుండునట్లే.

కాండము సన్న్యాసులచే ముఖ్యముగఁ బఠింపఁబడును. అందు వర్ణభేదములేదు. హిందుదేశమునం దుత్తమవర్ణము వాఁడును సన్న్యసింపవచ్చును; అధమవర్ణమువాఁడును సన్న్యాసికావచ్చును. అప్పుడు రెండువర్ణములును సమానములేయగును. మతమునందు వర్ణములేదు. వర్ణము కేవలముసాంఘికనిర్మాణమే. శాక్యముని దాను గేవలముసన్న్యాసియే. గూఢములగు వేదములనుండియెత్తి, సత్యములను బ్రకటించి, వానిని లోకమంతటను విరివిగ వెదఁజల్లిన, మహోదారహృదయుఁడగుటయే, వానికీర్తి మూర్తీభవింపఁగారణమయ్యెను. మతబోధనమును బ్రపంచమునఁ బ్రచారములోనికిఁ దెచ్చిన[1]మేల్బంతి యితఁడే; ఇంతియకాదు, [2]అన్యమతప్రవేశతాభావమునకు మొదట గర్భముచేసిన వాఁడే యితఁడు.

గురుమహామహిమకు [3]మూలము, ప్రతిజీవాత్మయందును నతఁడు చిలికిన, యద్భుతదయారసమే. ఆయన శిష్యులలోఁగొందఱు బ్రాహ్మణులును గలరు. బుద్ధుఁ డుపదేశించునపుడు హిందుదేశమున సంస్కృతభాషను జనులు మాట్లాడుటయే లేదు. అపుడు పండితులపుస్తకములలో మాత్రమే యది చూడనైయుండెను. బుద్ధుని బ్రాహ్మణ

1 మొదటివాఁడు. 2 అన్యమతప్రవేశమునకు మొదట దారిఁ జూపినవాఁడు. 3 కారణము.

శిష్యులలోఁగొందఱు వానియుపదేశములను సంస్కృత భాషయందు వ్రాయఁగోరిరి. కాని యతం డిట్లు స్పష్టముగ నిర్వచించెను.—"నేను బేదలకొఱకు కున్నాఁడను; నేను బ్రజాపతుపాతిని. ప్రజలభాషలోనే నన్ను మాటాడనిండు." కావుననే యీరోజువఱకు వానియుపదేశ[1]బృహజ్జాతకములు సామాన్యముగ నాకాలపు దేశభాషలోనే వ్రాయఁబడి గాన వచ్చుచున్నవి.

వేదాన్తతత్త్వవిచారణ[2]దర్శనము లెట్లున్నను, మరణ మనునది ప్రపంచములో నున్నంతకాలము, మానవహృద యములందు బుద్ధిదౌర్బల్యము నెలకొనియుండునంతకా లము, మనుజునిమనసునుండి వానిదుర్బలతావశమునఁ, బొరలివచ్చునట్టియేడ్పు బయల్పడుచున్నంతకాలము, దేవుని యందు భక్తి విధిగనుండును.

తత్త్వశాస్త్రవిషయమున, మహాగురునిశిష్యులు శా శ్వతములయిన వేదపర్వతములను గదలింపఁజొచ్చిరికాని కొంచెమైనను భేదింపనేరక మార్గాగము పెట్టినను, వేఱొండు విషయమునఁ, బ్రతిజనుఁడును, మగవాఁడేమి యాఁడు దేమి తా రట్టిభక్తిపరులై నమ్ముకొనియున్న యామహానుభావుని, [3]వారలు దేశమునుండి దోడ్కొనిపోయిరి. అంతట హిందు

1 బౌద్ధోపదేశములకు జాతకగ్రంథములని పేరు. 2 శాస్త్ర ములు. 3 మహాగురుని శిష్యులు, హిందుదేశమునుండి బౌద్ధమతగ్రంథములనన్నిటిని బరదేశములకు గొంపోయిరి.

దేశమునందు బౌద్ధమతము మృత్యుముఖమునఁబడ సిద్ధమయ్యెను. ఈరోజునఁ దనజన్మభూమి యగుహిందు దేశమునందు బౌద్ధుఁడననుకొనుట కొక్కండైనను గానరాఁడు. కాని దానితోడనే బ్రాహ్మణమతమునకుఁ గూడఁగొంత నష్టము కలిగెను.— ఆసంస్కరణాభిని వేశము, ప్రతిజీవము నెడలను బ్రసరించునట్టి యాయద్భుత దానదయాధర్మములు, "భారతీయుండెన్నఁడు నసత్యమెఱుఁగఁడు, హైందవ సతీమణి యెన్నండును బతిభక్తివిడువదు" అని యాకాలపు హిందు దేశమును బరికించి తనినిదీర వ్రాసి 'గ్రీకు' చారిత్రకుండు మెచ్చుకొనునట్లుగ, హిందు ప్రజాసంఘమునకు మహాఘనతనుసంపాదించి, బౌద్ధమతము ప్రజలకొనరించిన యాయద్భుతకార్యములు--ఇవెల్లయును బ్రాహ్మణమతమునందుఁ [1]గొరవడెను.

బౌద్ధమతమునువీడి హిందుమతము, హిందుమతమునువీడి బౌద్ధమతమును బ్రదుకఁజాలవు. మాకీయెడఁబాటువలన నేమియొనగూడెనో చూడుఁడు.—బౌద్ధుఁడు బ్రాహ్మణునిమేధయుఁ దత్వబోధమును లేక నిలువఁజాలఁడు; బ్రాహ్మణుఁడు బౌద్ధునికరుణార్ద్రహృదయములేక మననేరఁడు. బౌద్ధబ్రాహ్మణులయీావియోగమే హిందు దేశము చెడిపోవుటకుఁగారణమయ్యెను. ఇందువలననే, గతించిన వెయ్యేండ్లనుండియు భారతదేశము పరరాజులకుబానిసయై చావలేక

1 తక్కువ కానయ్యెను.

లేవలేక బ్రదుకుచుండెను. కాఁబట్టి [1]హృత్ప్రదేశము, [2]పరమాత్మైకనివాసముగు బ్రాహ్మణునియద్భుతబుద్ధి[3]వైశద్యము, మహాగురుని యద్భుతదాక్షిణ్యాశక్తియుఁ గలిసి ముడివడ మనము దారమగుదుముగాక.

## 6. కడపటిసభలోఁ జేసిన ప్రసంగము.

ప్రపంచమతాలోచనాసభ యిప్పుడు సార్థకమైనది. దయామయుండయిన యాజగజ్జనకుండును, దీనిని నెఱవేర్ప వలయునని పాటుపడినవారికి సాయపడి, స్వప్రయోజనపరత్వ మిసుమంతయు లేనివారిశ్రమమును సఫలముచేసెను.

ఎవ్వరియుదాత్తహృదయములును, సత్యవాక్ప్రియత్వమును, నీయద్భుతస్వప్నమును గలఁగని, యాచరణముచేఁ [4]గార్యరూపమునఁ బెట్టినవో యామహాత్ములకు నా నమస్కారములు. ఈ సభావేదికయందుఁ [5]బొరలికెరలెడు నుదారభావములనే యానందవర్షధారలకు నానమస్కారములు. జ్ఞానతేజస్సునవెలుఁగు నీసభ్యులు నాయం

1 గుండెప్రదేశము. 2 పరమాత్మ నివసించు ముఖ్యస్థానము. 3 నిపుణత. 4 అనఁగా మతములనన్నింటిని విమర్శింపవలయునని తలంచి యీమహామతసభను జరపి తమమనోరథమును గొనసాగింపఁ గలిగిరో. 5 పొర్లి ప్రవహించెడు.

[1]ఏకరూపముతోఁ దమతమదయను జూపినందులకును, మతవైషమ్యములను సరాసరిగఁ జేయుట కనుకూలించిన యుక్తులనెల్ల న్యాయముగఁ గ్రహించినందులకును, వారలకు నమస్కరించెదను. అప్పుడప్పుడు [2]మనయీసమానభావమునకువిరోధాభిప్రాయములు వినవచ్చినను, నట్టివారు తమచోద్యమగు [3]విషమత్వముచేత మనయందఱి [4]సమత్వమునకు [5]సారస్యమును గల్పించిరి గావున వారలకు నేను బ్రత్యేకముగ నమస్కరించుచున్నాఁడను.

మతైక్యవిషయమున బాధ్యతసమాన మని వివరముగఁ జెప్పియున్నారము. నామతముమాత్రము నేనిప్పుడు సాహసించి చెప్పఁబోవను. కాని యెవ్వఁడయిన నిచట, నీమతములన్నింటిలో నొక్కటి [6]యుత్కర్షమునుబొంది మిగిలినవి [7]యపకర్షణమును బొందుటవలన మతైక్యము సిద్ధించునని తలంచునేని, వానికి నేనిట్లుచెప్పెదను, "తమ్ముఁడా, నీది యసాధ్యపుఁదలంపుసుమీ!" క్రైస్తవుఁడు హిందుమతమునఁ జేరవలయునని నేనుగోరెదనా? శివశివ, నేనట్లు

1 అందఱు నేకీభవించి. 2 మతములన్నియు సత్యమును బోధించునవే యనుభావము. 3 సమానబుద్ధి లేకుండుట. 4 సమబుద్ధి, మతములకిందు సమానగౌరవము. 5 పరసత వీయభిప్రాయమునకైనను విరోధులుండినఁగాని నిగ్గు తేలదుగావున విరోధాభిప్రాయములు వీరసములై మొదటి దానికి రసము హెచ్చించును. 6 గొప్పతనము. 7 క్షయము.

కోరను. హైందవుఁడుగాని బౌద్ధుఁడుగాని క్రైస్తవమ తము నవలంబింపవలయునని నేను గోరుదునా? హరిహరి, పాపము శాంతినొందుఁగాక.

బీజమును నేలంజల్లితిమి. మన్ను, గాలి, నీరును దానిచుట్టు నెలకొనియున్నవి. అపుడు బీజమేమగును? మన్నో వాయువా, జలమా? కాదు; అది మొలకయగును. అదెట్లు దాని ప్రకృతినిబట్టి వృద్ధికావలయునో యట్లు వృద్ధినిబొంది, గాలి, నీరు, మన్నును బోసికొని, వానిని మోటికరూప ముగ మార్చుకొని చివరకు మొక్కయగును.

మతవిషయములోఁ గూడ నిట్లే. క్రైస్తవుఁడు, హైందవునిగానో, బౌద్ధునిగానో మాఱవలయుననియు, హైందవుఁడును బౌద్ధుఁడును గ్రైస్తవునిగమాఱవలెననియుఁ గాదు. కాని ప్రతివాఁడును నితరమతములయందున్న, తత్వమును గ్రహించి ధారణచేసికొనవలయును; అయినను నరుఁడు స్వకీయమైన [1]వ్యక్తితత్వములను (స్వత్వమును) గాపాడుకొనుచు నదెట్లు ప్రకృతియందు వర్ధిల్లవలయునో యదే ప్రకారము తానును బెరుగుచుండకతీరదు.

ప్రపంచమునకు మతమహాసభ యేమయినను దాగిఁ జూపెనా యయ్య దిదియే.—లోకములోఁ బవిత్రత, పరి శుద్ధత, వదాన్యతయు నేయొక్క మతమునకుఁగాని [2]పృథ

1 ప్రత్యేకముగనున్న ధర్మములను. 2 ఒక్కటీ యనుభవించు వలసినవిగావు.

గ్భుక్తములు కాఁజాలవని యీమహాసభ నిరూపించినది. ప్రతిమతమునందును మహానుభావులగు స్త్రీపురుషులు గల రనియును బ్రతిపాదించినది. ఇట్లు ప్రత్యక్షముగఁ జూచుచుండియు, మనుజుండు తనమతమేచివరకు నిలుచునదియును, మిగిలినవన్నియు నశించుననియుఁ, గలనైనఁ దలఁచునేని, నట్టివానినిజూచి, నాయంతరాత్మ జాలిఁగొనుచున్నది. ఎవ రెంతయెదిరించినను, "వితరణమేగాని వివాదముకూడదు; సమకూర్పుటేకాని [1]పోకార్చుట కూడదు; అనుకూల్యము, శాంతియునే గాని ప్రాతికూల్యముతగదు" అని ప్రతిమతము యొక్క పతాకముమీఁదను శీఘ్రముగనే వ్రాయఁబడునని బహిరంగముగఁ గనఁబర్చుచున్నాఁడను.

# అనుబంధము.

ఈసభలలో స్వామిచేసినప్రసంగములు నాలుగుమాత్రము కానవచ్చుటలేదు. "మతములను గుఱించిన ప్రపంచ సభ" యనుగ్రంథము ("జె. హెచ్. బారో" యనువానిచేరచితము) నందు స్వామిమాట్లాడినదినములు గంటలు,

1 నశింపఁజేయుట.

విషయములు నీక్రిందివిధముగ లిఖయింపఁబడియున్నవి.
(మొదటిప్రతి 152, 153, 154 పుటలలో)

శుక్రవారము, సెప్టెంబరు 22, ఉదయము 10-30 గంటలకు
పూజ్యుండు, స్వామివివేకానందుని యుపన్యాసము.
విషయము:—ఆస్తికహిందుమతవేదాంతదర్శనములగోష్టి.

సాయంతనసభ.

*     *     *     *     *

పూజ్యుఁడు, స్వామివివేకానంద, సన్న్యాసి, యతి.
హిందుదేశమునందలి నూతనమతములచర్చ.

శనివారము, సెప్టెంబరు. 23.

*     *     *     *     *

స్వామివివేకానందుని యుపన్యాసము.
పైఁజెప్పిన యుపన్యాసవిషయముల ప్రసంగము.

సోమవారము, సెప్టెంబరు 25 (సాయంతనసభ)

*     *     *     *     *

హిందుమతసారము; పూజ్యుఁడు వివేకానందస్వామి.

*     *     *     *     *

ఈసభలయందు హిందుమతమును గాపాడుచు మాట్లాడినప్పుడు, స్వామి, యాకాలమునందలి పద్ధతుల

ప్రకారము, తమజీవితములనుండి చాలునుపీలునులేక, తగిన జ్ఞానములేక యేవో గాలిసంగతులను ప్రోవుచేసి బూటకపు మాటల నాధారముగాఁజేకొని యేదేనిమతమునో జాతినో విమర్శింపుట బొత్తుగ నసంగతమని సభాసమక్షమున మహా తీక్ష్ణముగ మొదలించెను. ఈవిషయమునుదహరించు నొక నవీనసుప్రసిద్ధగ్రంథమునుండి యెత్తివ్రాసిన యీక్రిందివిష యముచూడ నగును.

"ఒకయద్భుతమగు నుదాహరణము; ఇదే మఱి యొకరుఁడైనచో సూక్ష్మదృష్టిలేని మందుఁడని చులకనఁజే యుదురు. అట్టిది సుప్రసిద్ధుండైన యొకహైందవుఁడు 1893 వ సంవత్సరములో నమెరికాఖండమునందలి 'చికాగో' నగ రమున జరగినప్రపంచమతాలోచనాసభయందు వేలకొలఁది సభ్యుల కుపన్యసించుచు, బహుయుక్తిగ వచియించెను. ఉపన్యాసమధ్యమున నించుక దడ వాగి, "హైందవులకుఁ గల పవిత్రగ్రంథములను బఠించి వారిమతమును సమూల ముగ దెలిసికొనిన సభ్యులెల్లరును దమహస్తములను బైకెత్తనగును" అని యాప్రవక్తపృచ్ఛచేసెను. అంతట వేదా న్తనాయకులని మిగులఁబేర్కొంచిన నానాదేశసభ్యులతోఁ గ్రిక్కిఱిసి నిండియున్నయాసభలో, మూఁడునాలుగుచేతు మాత్రము పైకెగసెను.

హైందవుఁడు దాను దాటిచెట్టుఁపొడుగునలేచి కరుణార్ద్రదృష్టితో సభాసదుల నెగసి యవలోకించి, శాపమోయనునట్లు, ప్రతిస్వరమునను సభ్యులనవియించు కంఠస్వరముతో నీచిఋతపలుకులు వలికెను.—"ఇంకనెన్నఁడు మాకుఁ దీరుపుచెప్పవలెననియే మీసాహసము!"

—"ప్రపంచచారిత్రకులచరిత్రము"—

'వావిళ్ల' ప్రెస్సు, చెన్నపురి :—1920.